DADDY

MUMMY

AND...

I

నేను వారందరినీ
నా ఎక్కో స్కెచ్
పెన్‌తో చిత్రించాను.

**EKCO**

స్కెచ్ పెన్‌తో

రంగులు, పిల్లలు వాటిని ఇష్టపడుతారు, వారు
డ్రాయింగు ఇష్టపడుతారు. మీపిల్లలలో
నిగూఢమైన ప్రతిభని వెలుపలికి తెండి.
అతనికి/ఆమెకి ఆకర్షనీయమైన ఎక్కో
స్కెచ్ పెన్‌ల సంచీని బహూకరించండి.
వవి ఆకర్షనీయమైన రంగులలో
వస్తున్నాయి.




డిస్ట్రిబ్యూటరు : కిరన్ & కం.
73/75 స్యామ్‌సెట్ స్ట్రీట్, బొంబాయి 400 002.
ఫోను : 324432

ఎక్కో స్కెచ్ పెన్‌లతో వ్రాయుటం
ఆనందదాయకం.

# రాజు కొండ ఎక్కేందుకు వెళ్ళాడు

రాజు, శంకర్ బడిపిల్లలతో కొండఎక్కేందుకు వెళుతున్నారు




శంకర్ రాజుని ఏడిపిస్తున్నాడు




వాళ్ళు విశ్రాంతికోసం కాసేపు ఆగుతారు




కాసేపటికి, రాజునితోయబోయి శంకర్ జారిపడతాడు







శంకర్ సిగ్గుపడి పోతున్నాడు




రాజు వరుస తప్పకుండా న్యూట్రాముల్ హాయిగా తాగుతాడు. న్యూట్రాముల్ అముల్ వారి ఆరోగ్యాన్నిచ్చే, రుచికరమైన పానీయం. న్యూట్రాముల్ బలవర్ధకమైన, మీగడగల అముల్ పాలతోపాటు, అసలైన కోకో, మాల్ట్, పంచదార కలసిన మిశ్రమం.

అరే, ఆశ్చర్యం! న్యూట్రాముల్ ఖరీదు కూడా తక్కువే. 500 గ్రాముల న్యూట్రాముల్ మీకు అందుబాటయే వెల రూ. 12.21. స్థానిక పన్నులు, సెంట్రల్ సేల్స్‌ట్యాక్స్, రవాణా ఛార్జీలు అదనం.

రాజుకి, ఇప్పుడిక శంకర్‌కి, ఇంకా దేశమంతటా వేలాది మందికి రోజూ న్యూట్రాముల్ తాగడం అంటే ఎంతో ఇష్టం.



అముల్ వారి
న్యూట్రాముల్
ప్రతి కప్పూ మీకు పోషణను ఇచ్చు

daCunha/N/3 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [''గాత్రపరీక్ష'']కు ఆధారం రాంబాబు రచన. మనుషులలో నిజమైన రసికత లోపించి నప్పుడు కళల విలువలు అంచనా వెయ్యటానికి కృత్రిమ మార్గాలు అనుసరించి ఎలా వైఫల్యం పొందేదీ ఈ కథ నిరూపిస్తుంది.

## అమరవాణి

శీలం, శౌచం, శాంతి, ర్దాక్షిణ్యం,
మధురతా, కులే జన్మ
న విరాజంతి హి సర్వే
విత్తవిహీనస్య పురుషస్య. 1

[శీలమూ, శౌచమూ, క్షమా, దయా, మధుర స్వభావమూ, ఉత్తమకులమూ—ఇవేవీ ధనహీనుడిలో రాణించవు.]

---

సంపుటి 64 ఫిబ్రవరి '79 సంచిక 2

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**కె. పద్మావతి భట్, కార్కళ (ద. కర్ణాటక)**

ప్ర: భూకంపాలు ఒకే చోట రావడానికి కారణం ఏమి ?

వ: భూగర్భంలో చాలా "నెర్రెలు" ఉన్నాయి. వీటితోబాటు బలియమైన సంచలనాలు కూడా ఉన్నాయి. భూగర్భంలోని వేడికి శిలలు ద్రవిస్తాయి, నెర్రెల కుండా ప్రవహిస్తాయి, భూరంధ్రాల కుండా పైకి చిమ్మి విధ్వంసం కలిగిస్తాయి. ఒక్కొక్కప్పుడు అగ్నిపర్వతం పేలుడుతో ఒక దీవిగాని, దీవిలో కొంత భాగంగాని నాశనం కావచ్చు. లేదా, పేలుడు ఫలితంగా పైకి వచ్చిన శిలాద్రవంతో ఒక కొత్తదీవి ఏర్పడవచ్చు. ఇలాటి సంఘటనల వెంట ఎంత శక్తి ఉండేదీ మనం ఊహించవచ్చు. ఆ శక్తికి భూగర్భంలోని నెర్రెలు పెద్దవికావటమూ, ఎగుడుదిగుడు కావటమూ జరిగితే భూకంపాలు కలుగుతాయి. అలాటి నెర్రెలు ఉండే ప్రాంతాలలోనే ఎప్పుడూ భూకంపాల ఫలితాలు కనిపిస్తాయి. నిజానికి భూమి కంపించినప్పుడు ప్రపంచమంతటా కూడా కంపనం తెలియవచ్చు. ఏ జపానులోనో భూకంపం వస్తే, కొన్నివేల మైళ్ళదూరానగల యంత్రాలు దాన్ని పసిగట్టుతాయి.

**టి. ఎస్. రమణరెడ్డి, పల్లలకుప్పం (తమిళనాడు)**

ప్ర: బస్సునడుస్తూ ఉంటే, అందులో దీపం చుట్టూ పురుగులు తిరుగుతూ ఉంటవి. బస్సుతోసహా అవి ఎలాగు ప్రయాణం చేస్తున్నవి ?

వ: బస్సు వేగంగాని, బస్సువెంట ఉన్న గాలివేగంగాని పురుగులకు అందినాక అవి బస్సుతోపాటు ప్రయాణం చెయ్యటానికి ఎలాటి ప్రయత్నమూ చేయనవసరం లేదు. ఏ మనిషి కూడా కూర్చుని గంటకు అనేకవందల మైళ్ళవేగంతో కదలలేడు. కాని మనుషులు విమానాలలో ఆ వేగంతో పోగలుగుతున్నారు గదా! ఆ మాటకు వస్తే భూమిమీద ప్రతివస్తువూ భూభ్రమణంలో గంటకు వెయ్యిమైళ్ళ వేగంతో కదులుతున్నది—రాళ్ళూ, రప్పలూతోసహా.

**ఏలేశ్వరపు వెంకట శ్రీకృష్ణ, మంగళగిరి (ఆంధ్ర)**

ప్ర: మునులు పులిచర్మాల మీద, జింకచర్మాల మీద ఎందుకు కూర్చుంటారు?

వ: మునులు అడవులలో ఆశ్రమాలు కల్పించుకుని, పెంపుడు జంతువులను తినేవారు. వారికి నూలూ, నేతా, చాపలూ ఇతర పరిశ్రమలులేవు. చంపిన మృగాల చర్మాలను చాపలుగా వాడేవారు.. ఒక దశలో చర్మాలనే బట్టలుగా కూడా వాడేవారు. శివుడు ఏనుగుచర్మం బట్టగా కట్టేవాడు.




## 68

ప్రణయకలహాల కథ

నందుడు గొప్ప సామ్రాజ్యాన్ని ఏలిన చక్రవర్తి. ఎంతలేసి రాజులూ అతనికి పాదాక్రాంతులైనారు. అతని ఖ్యాతి శరత్కాలపు వెన్నెలలాగా నిష్కలంక మైనది. అతని మంత్రి వరరుచి సకల శాస్త్ర పారంగతుడైన మహా మేధావి.

ఒక రోజు సాయంకాలం వరరుచికి అతని భార్యతో ప్రణయ కలహం వచ్చింది. అతనికి భార్య అంటే తగని ప్రేమ. అందుచేత అతను వీలయినంత త్వరలో ఆమెతో రాజీపడాలనుకుని, ఎన్నోవిధాల ఆమెను బతిమాలి చూశాడు. కాని అందువల్ల ఫలితం లేకపోయేసరికి అతను ఎంతో దీనంగా, "ప్రియా, నేను ఏం చేస్తే నీ కోపం పోతుందో చెప్పు, అలాగే చేస్తాను," అని భార్యతో అన్నాడు.

చాలాసేపు బతిమాలించుకుని చివరకు ఆమె, "నీ తల గుండు చేయించుకుని, నా పాదాల మీద పడినట్టయితే నేను ఎప్పటిలాగా ప్రేమగా ఉంటాను," అన్నది.

వరరుచి ఆమె కోరినట్టే చేసి, ఆమె కోపాన్ని పోగొట్టాడు.

ఆ సాయంకాలమే నందుడికీ, అతని భార్యకూ మధ్య ప్రణయ కలహం సంభవించింది. ఆమె కోపం పోగొట్టటానికి నందుడు ఎన్ని ప్రయత్నాలు చేసినా లాభం లేకపోయింది.

"ప్రియా, నువు లేకుండా ఒక గంట కూడా జీవించలేను. నీ కాళ్ళు పట్టుకుంటాను, కనికరించు," అని వేడుకున్నాడు నందుడు.

"కళ్ళెం నోట పెట్టుకుని, నన్ను వీపు మీద ఎక్కించుకుని, గుర్రంలాగా



సకిలిస్తూ, సవారీ చేయనిస్తే నేను తృప్తి పడతాను,'' అన్నది నందుడి భార్య.

నందుడు అలాగే చేశాడు.

మర్నాడు వరరుచి నందుడి దర్బారుకు వచ్చినప్పుడు, అతని గుండుకు కారణం ముందుగానే చారుల ద్వారా విని ఉన్న నందుడు, అతన్ని అవహేళన చేసే ఉద్దేశంతో, ''ఓ, వరరుచీ! మంచి రోజు కూడా చూడకుండా అలా తల గొరిగించుకున్నావేమిటి?'' అని అడిగాడు.

నందుడు చేసిన పని తెలుసుకుని ఉన్న వరరుచి, ''స్వామీ, మన పనులు సాధించుకోవాలంటే మనం అనేక పనులు చెయ్యవలసి ఉంటుందని తమరెరగరా? ఏదీ చెయ్యకపోతే ఏమీ జరగదు. అంతే గదా?'' అన్నాడు.

నందుడు జవాబు చెప్పలేదు.

కోతి మొసలికి ఈ కథ చెప్పి, ''మూర్ఖుడా, వాళ్ళు చేసిన పనులు భార్యలను తృప్తిపరిచినా ఇతరులకు హాని కలిగించలేదు. కాని, నువు మటుకు నీ మిత్రుణ్ణే చంపటానికి సిద్ధపడ్డావు. పైన నోరు జారి వాగావు. ఓంద్రపెట్టటం వల్ల చచ్చిన గాడిద కథ వినలేదా?'' అన్నది.

ఆ కథ ఏమిటని మొసలి అడిగిన మీదట కోతి ఇలా చెప్పింది:

పులితోలు కప్పుకున్న గాడిద కథ

ఒక గ్రామంలో ఒక చాకలి ఉండేవాడు. వాడికొక గాడిద ఉండేది. అది తిండిలేక నీరసించిపోయింది.

ఒకనాడు చాకలి అరణ్యంలో తిరుగుతూ, ఒక చచ్చిన పులిని చూసి ఇలా అనుకున్నాడు: ''నా గాడిద మీద ఈ పులి తోలు కప్పి, రాత్రివేళ పొలాలమీద వదిలి పెట్టితే, రైతులు దాన్ని చూసి పులే అనుకుని పారిపోతారు. అప్పుడు అది పంటచేలమీద పడి తిని, బాగా బలిసి, నా బట్టల మూటలు మొయ్యగలుగుతుంది.''

వాడు పులితోలు ఒలిచి, దాన్ని తన గాడిదమీద కప్పి, తన పథకం అమలు



చేశాడు. రైతులు గాడిదను చూసి పులే అనుకుని, దాన్ని తమ పొలాల నుంచి తరిమి వెయ్యటానికి భయపడ్డారు. గాడిద తెల్లవార్లూ కడుపారా మేసి, తెల్లవారేవేళ ఇంటికి తిరిగి వచ్చేది. ఇలా అది తెగతిని, వాకిలి పట్టనంత లావెక్కిపోయింది.

ఒక రాత్రి అది మేస్తూండగా, దూరాన మేసే ఆడగాడిద ఓండ్రపెట్టటం విని, తిక్క రేగి తానుకూడా ఓండ్రపెట్ట సాగింది. అది విని రైతులు, అది పులితోలు కప్పిన గాడిద మాత్రమేనని తెలుసుకుని, దాన్ని పట్టుకుని చావగొట్టేశారు.

కోతి గాడిద కథ ముగిస్తూండగా ఒక నీటి జంతువు వచ్చి మొసలితో, ''ఓయీ, కరాళముఖా! తిండి లేకుండా నీ కోసం ఆత్రంగా ఎదురుచూస్తూ ఉండిన నీ భార్య, నువు మామూలుకన్న ఎక్కువ ఆలస్యం చెయ్యటం చూసి నిరాశతోనూ, అసూయతోనూ ఆత్మహత్య చేసుకున్నది,'' అని చెప్పింది.

ఈ మాట విని మొసలి, ''అయ్యో, ఎంత దౌర్భాగ్యుణ్ణి! నాకెంత ఆపదవచ్చి పడింది! నా ఇల్లు ఇక ఇల్లు కాదు. మంచివాడికి భార్యే ఇల్లు. భార్య లేని ఇల్లు బంజరుతో సమానం. భార్య ఉంటే చెట్టుమాను మొదలైనా ఎంతో ఆనంద దాయకంగా ఉంటుంది. భార్యలేని రాజభవనం కూడా ఎడారితో సమానం,'' అనుకుని, కోతితో, ''మిత్రమా, నేను నీకు తలపెట్టిన ద్రోహాన్ని క్షమించు. నేను వెళ్ళి, నా భార్య చితిమీద ప్రాణాలు వదులుతాను. శలవు!'' అన్నది.

దానికి కోతి, ''నువు నీ భార్యకు దాసుడివనీ, ఆమె నిన్ను తన బొటన వేలికింద తొక్కిపట్టిందనీ నాకు మొదటి నుంచీ తెలుసు. ఇప్పుడు నువు ఆ సంగతి మరింత బాగా నిరూపించుకున్నావు. మూఢుడా, సంతోషించక ఏడుస్తున్నావా? అలాటి భార్యలు పోతే పండగ చేసుకోవాలి. అలాటి స్త్రీతో శాంతి అనేది ఉండదు. అలాంటివాళ్లను దండించిగాని, బహూక

రించిగాని, మెచ్చుకునిగాని దారికి తీసుకు రాలేం. అటువంటి దానికోసం ఆత్మహత్య చేసుకుంటావా? వద్దు!'' అన్నది.

''మిత్రమా, నువ్వన్నది చాలావరకు నిజమే. కాని నేను ఏం చెయ్యాలి? నా భార్యను పోగొట్టుకున్నాను, ఇల్లు పాడుబడింది. నీ స్నేహం పోగొట్టుకున్నాను. వెనకటికి రైతు భార్యలాగా ఉభయభ్రష్టుణ్ణి అయాను,'' అన్నది మొసలి.

''ఏమిటా కథ?'' అని కోతి అడిగితే మొసలి ఇలా చెప్పింది:

రైతు భార్య కథ

పూర్వం ఒక రైతు దూరంగా ఉన్న వ్యవసాయ క్షేత్రంలో తన అందమైన భార్యతో కాపరం చేస్తూండేవాడు. వాళ్లకు పిల్లలు లేరు. రైతు వయసు మళ్లినవాడు. భార్య పడుచుది కావటంచేత యువకుడైన ప్రియుడి కోసం చూడసాగింది.

ఆమె మీద కన్ను వేసి ఉన్న ఒక దుష్టుడు ఆమె అంతరంగం గ్రహించి, ఒకనాడు ఆమెను కలుసుకుని, ''అందాల రాశీ, నిన్ను చూసిన క్షణంలోనే ప్రేమించాను. ఇటీవలనే నా భార్య పోయింది. నేను, నా అనే వాళ్ళెవరూ లేని ఒంటరిగాణ్ణి. నన్ను నీ ప్రేమతో సుఖపెట్టు,'' అన్నాడు.

ఆమె సంతోషించి, ''నీకు అలాటి ఉద్దేశం ఉంటే నాకేమీ అభ్యంతరం లేదు. మనం ఇక్కడినుంచి పారిపోదాం. నా భర్త పెట్టెలో బోలెడు డబ్బు దాచాడు. అదంతా తెస్తాను. దానితో మనం సుఖంగా జీవించవచ్చు,'' అన్నది.

''మంచిది. నీ భర్త నిద్రపోయాక, ఈ రాత్రే నా దగ్గిరికి వచ్చెయ్యి.'' అన్నాడు దుష్టుడు.

ఆమె అందుకు ఒప్పుకున్నది.

ఆ రాత్రి తన భర్త నిద్రపోయేటప్పుడు ఆమె డబ్బంతా తీసుకుని, సంకేతస్థానం చేరుకున్నది. దుష్టుడు చాలా సంతోషించి, ఆమె వెంట నృత్యం చేస్తూ బయలుదేరాడు.





# భల్లూక మాంత్రికుడు

## 8

[రాజు దుర్ముఖుడు, తన వెంటబడిన తలారిభల్లూకం నుంచి పారిపోతూ, రాక్షసుడు ఉగ్రదండుడు కంటబడగానే, భయంకొద్దీ మూర్ఛపోయాడు. ఉగ్రదండుడు అతడి మూర్ఛ పోగొట్టేందుకు, అంగరక్షకుణ్ణి వాగు నుంచి నీళ్ళు తెమ్మన్నాడు. వాగు దగ్గరవున్న మొండి తొండపుటేనుగు, వాణ్ణి చూసి రెచ్చిపోయి ఘీంకరిస్తూ పరిగెత్తి రాసాగింది. తరవాత—]

రాక్షసుడు ఉగ్రదండుడు, తమను సమీపిస్తున్న ఏనుగు కేసి ఓసారి చూసి, తలారి భల్లూకుడితో, "ఈ తొండం తెగిన ఏనుగు, నీ వాహనమా? దీని వాలకం చూస్తే, ఒట్టి అడవి ఏనుగులా వున్నది," అన్నాడు.

"అవును, అడవి ఏనుగే! అరణ్యంలో నా దారిని అడ్డగించబోతే, గండ్రగొడ్డలితో తొండం మీద కొట్టి, పైనెక్కి కూర్చుని, చెవులు మెలిపెడుతూ యిక్కడికి తీసుకు వచ్చాను," అన్నాడు తలారి భల్లూకుడు.

అంతలో ఏనుగు వాళ్ళ దాపులుకు వచ్చేసింది. అది చూసి దొంగ నాగమల్లూ, అతడి ఇద్దరు అనుచరులూ గుహకేసి పరిగెత్తారు. అప్పటివరకూ మూర్ఛలో వున్న రాజు దుర్ముఖుడు తక్కున లేచి నిలబడి, బాణంలా చెట్లచాటుకు దూసుకు పోయాడు. అంగరక్షకుడు కీచుమంటూ



అరిచి, ఉగ్రదండుడి వెనక్కుపోయి నిలబడ్డాడు.

ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి, "ఒరే, ఇంతకు ముందు నువు, నాకు అంగరక్షకుణ్ణన్నావు. ఇప్పుడు నేనే, నీకు అంగరక్షకుణ్ణన్నమాట! ఛీ, పిరికివెధవా!" అని, మీదికి వస్తున్న ఏనుగు దారి నుంచి పక్కకు తప్పుకున్నాడు.

తలారిభల్లూకం గండ్రగొడ్డలి తిప్పుతూ, ఏనుగుకు అడ్డంగా పోయి, "అగు! నేనెవర్నో గుర్తించలేదా? తలారి భల్లూకుణ్ణి. నువు, నా వాహనానివి," అన్నాడు.

తలారి భల్లూకం మాట ముగించే లోపలే, ఏనుగు వాణ్ణి తొండంతో పట్టి పైకెత్తి, దూరంగా విసరబోయింది. కాని, అంతలో రాక్షసుడు ఉగ్రదండుడు పైకెగిరి, ఏనుగు చెవినొకదానిని వడిసి పట్టుకుని, రాతి గదతో దాని డొక్కల్లో గట్టిగా ఒక పోటు పొడిచాడు. ఆ దెబ్బకు ఏనుగు, తలారి భల్లూకుణ్ణి కిందికి జార్చి, దభీమంటూ నేలమీద పడిపోయింది. ఉగ్రదండుడు మెరుపులా పోయి, దాని ముందు కాళ్ళు రెండూ కలిపి పట్టుకుని పైకెత్తుతూ, "ఒరే, అంగరక్షకా! వెంటనే పోయి, అడవిచెట్ల తీగలు లాక్కురా. దీన్ని కాళ్ళు కట్టివేయాలి," అన్నాడు.

అంగరక్షకుడు చెట్లల్లోకి పరిగెత్తాడు. తలారి భల్లూకుడు దిమ్మెరపోయిన వాడిలా కళ్ళు మూసి తెరుస్తూ, "ఉగ్రదండ రాక్షసా! నా మంత్రపు గండ్రగొడ్డలి శక్తి కన్న, నీ దేహబలమే మిన్నలా వున్నది. నన్ను ప్రాణాపాయం నుంచి కాపాడావు, మెచ్చాను. ఏం కావాలో కోరుకో, యిస్తాను!" అన్నాడు.

ఉగ్రదండుడు, తలారి భల్లూకుడి కేసి చిరునవ్వుతో చూసి, "నేను కోరుకోవలసినదేమైనా వుంటే, అది నీ గురువైన భల్లూకమాంత్రికుడి నుంచి! ప్రస్తుతానికి, యీ రెచ్చిపోయిన ఏనుగు మళ్ళీ లేచి గొడవ చేయకుండా, కాస్త నాతోపాటు దీని కాళ్ళు బిగించి పట్టుకో," అన్నాడు.

తలారి భల్లూకుడు, ఉగ్రదండుడి కేసి చురచుర చూస్తూ, "ఈ నా చచ్చు వాహనం కాళ్ళు, నేను పట్టుకోవటమా? అంతకన్న అవమానం కద్దా? ఇదుగో, ఈ క్షణానే నా మంత్రపు గండ్రగొడ్డలితో, దీని తల నూరుప్రక్కలు చేయబోతున్నాను," అంటూ గండ్రగొడ్డలి ఎత్తాడు.

"ఒరే, బాబూ, కాస్త ఆగు! ఇంత కాలంగా తలారిగా బతికినవాడివి, ఇన్ని ఊకదంపుడు మాటలు ఎప్పుడు నేర్చావు? ఈ ఏనుగును చంపటం జరిగితే, ఆ తరవాత నీవు వచ్చిన పని సాధించుకుని, నీ యజమాని భల్లూకమాంత్రికుడి దగ్గరకు ఎలా పోగలవు? ఆలోచించావా?" అని అడిగాడు ఉగ్రదండుడు.

తాను వచ్చిన పని ఉగ్రదండుడు గుర్తు చేయగానే తలారి భల్లూకుడు ఎగిరి ఒక్క గంతువేసి, "ఔనౌను, ఆ దుష్టుడు దుర్ముఖరాజెక్కడ? ఈ క్షణం వరకూ వాడిక్కడ మూర్ఛలో, నేలకరిచి వున్నాడు గదా?" అని దిక్కులు చూడసాగాడు.

కిందపడిన ఏనుగు ఉగ్రదండుడి పట్టు నుంచి బయటపడేందుకు ఘీంకరిస్తూ, నానా గొడవాచేయసాగింది. ఉగ్రదండుడు దాని కాళ్ళు వదలక, తానూ పెద్దగా హుంకరిస్తూ, "ఒరే, అంగరక్షకా, ఎక్కడ చచ్చావు? యింత ఆలస్యమా?" అంటూ కేకపెట్టాడు.

"ఉగ్రదండయ్యా, యిదె వచ్చె!" అంటూ దొంగనాగమల్లూ, అతడి యిద్దరు





అనుచరులూ పెద్ద మోకు తీసుకుని అక్కడికి వచ్చారు.

ఉగ్రదండుడు, వాళ్ళకు ఏనుగు కాళ్ళను మోకుతో బిగించి కట్టమని చెప్పి, "ఆహాఁ, మీర్రా నిజమైన దొంగలు! ఎప్పటికి ఎలాంటి వస్తువు అవసరం కలుగుతుందో అని, అన్నీ ముందుగానే జాగర్త పరిచారు," అన్నాడు.

నాగమల్లు ఏనుగు కాళ్ళకు తాడు బిగిస్తూ, "ఉగ్రందడయ్యా, మేం అరణ్య జీవులం గదా! మీ రిక్కణ్ణించి వెళ్లేప్పుడు, మా కోర్కె ఒకటి తీర్చాలి," అన్నాడు.

"ఓఁ, తప్పక తీరుస్తాను. ఈ తలారి భల్లూకుడి చేత, మీ ముగ్గురి తలలూ నరి కించమనేదే గదా, మీరు కోరేది?" అన్నాడు ఉగ్రదండుడు.

నాగమల్లు నిలువెల్లా వణికిపోతూ, ఏదో అనబోయేంతలో తలారి భల్లూకుడు, "దిరిశెనవన, భైరవా!" అంటూ భీకరంగా ఒక కేకవేసి, గండ్రగొడ్డలి పైకెత్తి, "ఒరే, దారిదోపిడి వెధవల్లారా, ఆ దుర్ముఖ రాజెక్కడ? వాణ్ణి ఎక్కడదాచారు? తక్షణం చెప్పకపోయారో, మీ తలలు పీకెకు బెత్తెడు కిందివరకూ తెగనరుకు తాను," అన్నాడు.

దొంగ నాగమల్లు గడగడలాడుతూ, "భల్లూకయ్యా, తల సొంతం తెగి పోయేప్పుడు, అది పీకెకు బెత్తెడుపైగా అయినా లేక కిందుగా అయినా ఒకటే! ఆ దుర్జయశెట్టి నని బొంకే దుర్ముఖ రాజు మూర్ఛపోయి, యీ ప్రాంతాలనే ఎక్కడో వున్నాడు గదా?" అన్నాడు.

"అదే నేనూ అడిగేది! వాడిప్పుడు ఏమయ్యాడు? వాడితల తీసుకు పోకపోతే ఆ భల్లూక మాంత్రికుడు నా తల తీసే స్తాడు," అన్నాడు తలారి భల్లూకుడు ఏడ్పుముఖంపెట్టి.

ఆ సరికి నాగమల్లు అనుచరులిద్దరూ ఏనుగు ముందు కాళ్ళను తాడుతో గట్టిగా బిగించారు. అది వెనక కాళ్ళను జాడిస్తూ, లేచేందుకు నానా హైరానా పడసాగింది.

అప్పుడు అక్కడికి అంగరక్షకుడు పొడవాటి అడవి తీగలను భుజాన వేసుకుని వచ్చాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు, ఆ తీగలతో ఏనుగు వెనక కాళ్ళను కూడా బంధించమని నాగమల్లు అనుచరులతో చెప్పి, అంగరక్షకుడితో, "ఒరే, అంగరక్షకా! ఏమిటలా.. నేల చూపులు చూస్తున్నావు? ఏదో రహస్యం దాచాలని ప్రయత్ని స్తున్నావు, అవునా? చెట్ల చాటుకు పారిపోయిన ఆ దుర్ముఖరాజును ఎక్కడైనా దాచి వచ్చావా ఏం?" అన్నాడు.

ఆ ప్రశ్నతో అంగరక్షకుడు ఉలిక్కిపడి, "దండ మహారాజా, నేనిప్పుడు ఆ రాజుకు కాదు; తమకుగదా అంగరక్షకుణ్ణి?" అన్నాడు.

తలారి భల్లూకుడు రెండడుగులు ముందుకువేసి, పళ్ళు కొరుకుతూ, అంగరక్షకుడితో, "ఒరే, ఆ దుర్ముఖుడు ఎక్కడ దాగివున్నదీ, నీకు తెలుసు. నీ దొంగ చూపులే అందుకు సాక్ష్యం. నిజం చెబుతావా, తల నరకమంటావా?" అంటూ గండ్రగొడ్డలి పైకెత్తాడు.

అంగరక్షకుడు కీచుమంటూ అరుస్తూపోయి, ఉగ్రదండుడి చాటుగా నిలబడి, "దండమహారాజా, మీ అంగరక్షకుణ్ణి రక్షించుకోవలసినవారు, మీరే!" అన్నాడు.



ఉగ్రదండుడు, వాడి మెడ పట్టుకుని ముందుకు లాగి, "ఒరే, ఆ దుష్టరాజు ఎక్కడ దాగివున్నదీ నిజం చెప్పకపోతే, నీ శరీరాంగాల్లో తలను కాపాడటం మాత్రం నా తరంకాదు. అడవి తీగలు తెచ్చేందుకు వెళ్ళినప్పుడు, పారిపోతున్న ఆ రాజు నీ కంటబడ్డాడు. అతడితో ఏవో మంతనాలాడి యిక్కడికి వచ్చావు, అవునా? జరిగిందేమిటో చెప్పకపోయావో నిన్ను, యీ ఏనుగు తొండానికి అందిస్తాను," అంటూ అంగరక్షకుణ్ణి, కిందపడివున్న ఏనుగు కేసి లాగాడు.

అంగరక్షకుడు లబోదిబోమంటూ చేతులు రెండూ పైకెత్తి, "దండమహా



రాజా, శరణు! శరణు! ఆ రాజు నాకు అర్ధరాజ్యం ఆశపెట్టాడు. ఎలాగో మీ అందరి కళ్ళూ కప్పివస్తే, ఇద్దరం కలిసి ఉదయగిరిపట్టణం చేరదామన్నాడు. ఆ తరవాత నన్ను అర్ధరాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేస్తాడట!'' అన్నాడు.

''ఆ మాటలు నువ్వు నమ్మావన్నమాట!'' అంటూ రాక్షసుడు ఉగ్రదండుడు పెద్దగా నవ్వి, ''ఒరే, అంగరక్షకా! నువ్వు మనిషివై వుండీ, మనిషి మాటలు నమ్మటం నాకు ఆశ్చర్యంగా వుంది. ఆ పట్టణం చేరాక నీకు జరిగేది రాజ్యాభిషేకం కాదు; పట్టణం మధ్య మండు ఎండలో నిలువునా కొరత. తెలిసిందా?'' అన్నాడు.

''అంతే అయుంటుంది, దండమహారాజా! నేనిక ఎక్కడికీ పోను. తమ వెంటే అంగరక్షకుడుగా మిగిలిన ఆయుర్దాయమంతా గడిపేస్తాను,'' అంటూ అంగరక్షకుడు వగర్చసాగాడు.

అప్పటివరకూ యీ జరిగినదంతా తలాడిస్తూ చూస్తున్న తలారిభల్లూకుడు, ''జై, భల్లూకమాంత్రికా!'' అంటూ అరణ్యం దద్దరిల్లేలా ఒక కేకపెట్టి, ''ఇక యీ చచ్చు కబుర్లన్నీ కట్టిపెట్టండి. నే వచ్చినపనేమిటి? మీ వీధి భాగవతం ముచ్చట్లేమిటి? భల్లూకమహామాంత్రికుణ్ణి అవమానించిన ఉదయగిరి రాజు దుర్ముఖుణ్ణి వెంటనే తెచ్చి, నా ముందు పెట్టాలి. అలా చేయకపోయారో, మీ అందరి తలలూ వరసగా నరికి, యీ అడవి తీగలకు గుచ్చి, మెడలో వేసుకుంటాను,'' అన్నాడు.

ఆ మాటలకు రాక్షసుడు ఉగ్రదండుడు కోపం తెచ్చుకుని, ''తలారి భల్లూకా! నీకు ఒంటరిగా ఇందరి తలలు నరికే శక్తి వున్నదంటావా?'' అని అడిగాడు.

తలారి భల్లూకుడు నిప్పులు చెరిగే కళ్ళతో అతడికేసి చూస్తూ, గండ్రగొడ్డలి పైకెత్తి, ''ఈ గొడ్డలి భల్లూకమహా

మాంత్రికుడి వరప్రసాదితం. దీని ధాటికి ఎదురులేదు. ఏదీ, నీ రాతిగదతో దెబ్బ కాచుకోగలవేమో చూడు!'' అంటూ ఉగ్రదండుడి కేసి ఒకడుగు వేశాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు రెండడుగులు వెనక్కు వేసి, ''తలారి భల్లూకా, కొంచెం శాంతించు! మనిద్దరం ఒకళ్ళనొకళ్ళం చంపుకోవటం, యిక్కడ చేరిన సన్నకారు దుష్టులకు మేలవుతుందని, లోగడే ఒక సారి చెప్పాననుకుంటాను,'' అన్నాడు.

''అది సరే, రాజు దుర్ముఖుడి తల మాటేమిటి? అది వెంట లేకుండా నేను, భల్లూక మహామాంత్రికుడి దగ్గిరకు ఎలా వెళ్ళటం? ఏమని చెప్పటం?'' అన్నాడు తలారి భల్లూకుడు.

''ఆ రాజు కోసం అందరం కలిసి, యీ చుట్టుపక్కల అరణ్యమంతా గాలిద్దాం. రాజప్రాసాదాల్లో, పూలవనాల్లో తిరిగే ఆ ముచ్చువెధవ, యీ భయంకరారణ్యంలో ఒంటరిగా ఎక్కడికీ పోలేడు,'' అన్నాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

అందరూ కలిసి దుర్ముఖుడు పారిపోయిన వైపుకు బయలుదేరబోతున్నంతలో దూరాన్నుంచి, ఒక చావుకేకా, ఆ వెంటనే, ''ఒరే, తొందరగా బాణం కొట్టు. నేను ఉదయగిరి రాజును! అర్ధ రాజ్యం నీ కిస్తాను,'' అన్న మాటలూ వినిపించినై.

ఆ గొంతు రాజు దుర్ముఖుడిది! అంగరక్షకుడు కోపంగా అటుకేసి పరిగెత్తుతూ,



"నా కిస్తానన్న అర్ధరాజ్యాన్ని రాజు మరెవడికో ధారపోస్తున్నట్టున్నది; నేను సహించను!" అంటూ కేకపెట్టాడు.

అంగరక్షకుడు వెళ్ళేసరికి, రాజు దుర్ముఖుడు ఒక పెద్ద చెట్టుకు ఏటవాలుగావున్న కొమ్మ చివరకు పాకిపోతున్నాడు. అతడికి కొంచెం ఎడంగా చిరుతపులి ఒకటి, కోరలుచాచి, చిన్నగా అరుస్తూ ముందుకుపోతున్నది. చెట్టుకింద ఒక ఆటవికుడు బాణం ఎక్కుబెట్టి నిలబడివున్నాడు.

అంగరక్షకుణ్ణి చూస్తూనే రాజు దుర్ముఖుడు పెద్దగా మూలిగి, "ఒరే, అంగరక్షకా! అలా చూస్తావేం? ఈ పులి నన్ను నోటపట్టకముందే బాణం కొట్టి చంపు. ఆటవిక మందమతి వెధవ నుంచి విల్లంబులు లాక్కో." అన్నాడు.

ఆ మాటలకు అంగరక్షకుడు ఏమాత్రం తొణక్కుండా, "మహారాజా! చిరుతపులిని చంపితే, అర్ధరాజ్యం యిస్తానని కేక పెట్టింది, మీరేనా?" అని అడిగాడు.

"అవున్రా, నేనే! మీదికి దూకక ముందే పులిని బాణంతో కొట్టు," అని దుర్ముఖుడు కీచుమంటూ అరిచాడు.

"మా ఇద్దరికీ రాజ్యాన్ని చెరిసగం పంచేస్తే, యిక మీకు మిగిలేదేమిటి, మహారాజా?" అన్నాడు అంగరక్షకుడు.

"ప్రాణాలురా! నిండు ప్రాణాలు!" అంటూ రాజు పెద్దగా అరిచాడు.

ఆటవికుడు దుర్ముఖుడి కేసీ, తన పక్కనే నిలడిన అంగక్షకుడి కేసీ అమాయికంగా ఓమారు చూసి, "నాకు రాజ్యాలూ వద్దు, అర్ధరాజ్యాలూ వద్దు, ఐదువరహాలిస్తే చాలు!" అంటూ చిరుతపులి, దుర్ముఖుడి మీదికి దూకబోతున్నంతలో, గురిగా దానికేసి బాణం కొట్టాడు.

బాణం వచ్చి డొక్కలో తగలగానే గర్జిస్తూ చిరుతపులీ, దాని పంజాదెబ్బకు కొమ్మ పట్టువిడిచిన రాజు దుర్ముఖుడూ కలిసికట్టుగా, పై నుంచి దభీమంటూ కిందికివచ్చి పడ్డారు. --(ఇంకావుంది)





# గాత్రపరీక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఈ ప్రపంచంలో దేని విలువా నిర్ణయించటం అసాధ్యమనిపిస్తుంది. మాట వరసకు నీ శ్రమ విలువ ఎంత? విలువలు నిర్ణయించే బాధ్యత అతీత శక్తులకు వదలినా ఫలితం శూన్యం అనటానికి నిదర్శనంగా, నీకు సంగీత ప్రియుడైన కాంతివర్మ అనే రాజు పొందిన వింత అనుభవం చెబుతాను, శ్రమతెలియకుండా విను.'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వసంత దేశాన్ని ఏలిన కాంతివర్మ అమితమైన సంగీతప్రియత్వం గలవాడు. అతను రోజూ సంగీతం విని ఆనందించా

## బేతాళ కథలు



లనుకునేవాడు. అయితే ఆయన ఒక రోజు పాడినవాడిచేత మళ్ళీ పాడించేవాడు కాడు. కారణం, ఎవరి పాట విన్నా అందులో ఏదో లోపం ఉందనిపించేది. ముఖ్యంగా పాడేవాడి గాత్రం శ్రావ్యంగా ఉండాలి. కాని ఎవరి కంఠం ఎంత శ్రావ్యంగా ఉన్నదనే విషయం రాజుగాని, సభికులుగాని నిష్కర్షగా నిర్ణయించలేకపోయేవారు.

రోజూ పాటకచేరీలు జరుగుతూనే వున్నాయి. రోజు కొక కొత్తవాడు వచ్చి పాడుతున్నాడు. కొన్ని కంఠాలు మరీ దుర్భరంగా ఉండి, రాజునూ, సభికులనూ చాలా బాధపెట్టేవి. అయినా రాజు తన సంగీత ప్రియత్వాన్ని వదులుకోలేక పోయాడు.

ఇలా ఉండగా ఒక రాత్రి కాంతివర్మకు కలలో సరస్వతీదేవి కనిపించి, ''దక్షిణంగా అరణ్యాలలోకి వెళితే, ఒక మర్రిచెట్టు కింద ఒక మహిమ గల వీణ ఉన్నది. దాన్ని తెచ్చుకో దానివల్ల ఉపయోగమేమిటంటే, దాన్ని ఎదురుగా పెట్టుకుని ఎవరైనా పాడితే, వారి కంఠస్వరం ఎలాఉన్నదీ అది చెబుతుంది. అంతేకాదు, పాడినవాళ్లు తమ కంఠస్వరానికి అనుగుణమైన రూపం కూడా పొందుతారు,'' అని చెప్పి అదృశ్యమయింది.

అది కల అని నిద్ర లేచినాకగాని కాంతివర్మకు తెలియలేదు. అయినా ఆ కల ఎంత వాస్తవంగా తోచిందంటే, మర్నాడు అతను కలలో దేవి చెప్పిన ప్రకారమే అరణ్యంలోకి వెళ్ళి, మర్రిచెట్టును సులువుగానే కనుక్కున్నాడు. దాని కింద వీణ ఉండనే ఉన్నది.

అతను ఆ వీణను తీసుకుని తిరిగి వచ్చి, దాన్ని పుష్పాలతో పూజించి, సంగీత సభ జరిగే చావడిలో మధ్యగా ఉంచాడు.

ఆ రోజు మొదలు రాజుగారి సముఖాన పాడటానికి వచ్చినవాడికి ఆ వీణ గురించి

చెప్పటం జరిగింది. పాడినవాడి కంఠం గురించి వీణ తన అభిప్రాయం చెబుతుంది; అది చెప్పే అభిప్రాయానికి అనుగుణమైన రూపు పాడినవాడికివచ్చేస్తుంది!

ఈ హెచ్చరికను అర్థం చేసుకోకనే, లక్ష్యపెట్టకనే మొదట పాడినవాణ్ణి గురించి వీణ, ''గార్దభ స్వరం'' అన్నది. వెంటనే ఆ గాయకుడు గాడిదగా మారి, ఓండ్రపెట్టుతూ సభనుంచి పారిపోయాడు.

ఇది జరిగిన తరవాత మూడు రోజుల పాటు గాయకులు, వీణకు భయపడి, పాటకచేరీ చేయ సాహసించలేదు. కాని నాలుగో రోజు ఎక్కడినుంచో గానకళా కోవిద బిరుదాంకితుడు ఒకడు వచ్చి, వీణముందు పాడాడు. అతను ఆపగానే వీణ ''గేదె గొంతు!'' అన్నది. వెంటనే గానకళాకోవిదుడు దున్నపోతుగా మారి, అరుస్తూ పరిగెత్తిపోయాడు.

ఆ మర్నాడు మరొకడు, వీణ తనకు ఆక్షేపణ చెప్పలేదనుకుని, సాహసించి పాడాడు. ''కుక్క కంఠం'' అన్నది వీణ. వెంటనే ఆ పాడినవాడు కుక్కగా మారి, మొరుగుతూ సభనుంచి పారిపోయాడు.

ఇదంతా చూస్తూంటే రాజకుమారి కలకంఠికి మండుకొచ్చింది. ఈసారి ఆమె వీణముందు కూర్చుని పాడింది. ఆమె కంఠం చాలా మధురమైనది కావటంచేత, చాలాకాలానికి సభికులు ఆమే పాటతో తన్మయులయారు. ఆమె



పాడగానే వీణ, "కోకిల స్వరం!" అన్నది. వెంటనే రాజకుమారి కోకిలగా మారి కూస్తూ, అక్కడినుంచి ఎగిరిపోయింది.

సభలో అందరికీ పట్టలేని ఆగ్రహావేశం వచ్చింది. అందరూ, వీణమీద పడి దాన్ని విరిచి చిన్న చిన్న పేళ్లు చేసేశారు. అప్పటికీ కోపం తీరక రాజు ఆ పేళ్ళను కాల్చి బూడిద చేశాడు. వెంటనే, వీణ మూలంగా రూపాలు మారినవారందరికీ యథారూపాలు వచ్చాయి.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సాక్షాత్తూ సరస్వతీదేవి ప్రసాదించిన వీణ వల్ల, సంగీత ప్రియుడైన రాజుకు కించిత్తు ఉపయోగంలేకపోగా, దాని మూలంగా ఇంత అనర్థం జరగటానికి కారణ మేమిటి? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కాంతివర్మను సంగీతప్రియుడనటానికి ఆధారం కన పడదు. అతని సంగీతలోలత్వం వ్యసనం అని తోస్తుంది. మద్యానికి అలవాటుపడి, మానలేనివాడు ఏది దొరికితే అది తాగి నట్టుగా, కాంతివర్మ పాడతానని వచ్చిన ప్రతివాడిచేతా పాడించుకుని బాధ అయినా పడ్డాడుగాని, మంచి సంగీతమే వింటానని తీర్మానించుకోలేదు. సంగీత ప్రియుడు మంచి సంగీతమే వింటాడు. అతనికి కలలో కనిపించినది నిజంగా సరస్వతీదేవే అయిన పక్షంలో ఆమె అతనికి జ్ఞానోదయం కలిగించటానికే ఆ వీణను ఇచ్చిందనుకోవాలి. ఎందుకంటే కంఠమాధుర్యాన్ని నిర్ణయించటానికి రసజ్ఞుడైన వాడి చెవికన్న గొప్పది లేదు. పాటలోని శ్రావ్యత్వాన్ని కొలవటానికి కృత్రిమ సాధనాలు పనిచెయ్యవు చివరకు కాంతివర్మకు ఆ సంగతి తెలిసి వచ్చి వుండాలి,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—[కల్పితం]






మంగళాపురం గ్రామాన్ని చేరబోతున్న చిన్నడికి ఒక విచిత్రం కనిపించింది. ఊరి బయట రకరకాల పంటపొలాలలో దమ్ము కొంచెం కూడా లేక, నేల నెర్రెలు విచ్చుతున్నది. పైర్లు ఎండిపోతున్నాయి. కాని వాటిని అనుకుని ఉన్న చెరువు నిండా నీరున్నది!

మరికొంత ముందుకు పోయి, చిన్నడు ఇంకొక విడ్డూరం చూశాడు. ఒక పెద్ద తోపులో చింతా, మామిడి మొదలైన చెట్లకు పాదులు తవ్వి, కొందరు మనుషులు నీరు పెట్టుతున్నారు!

''ఈ ఊరివాళ్ళకు మతులు లేవా?'' అనుకుంటూ, చిన్నడు పొలాలలో ఉన్న మనుషుల దగ్గిరికి పోయి, ''ఒక పక్క పంట పొలాలు నీరు చాలక ఎండి పోతుంటే. ఇంకోపక్క మహావృక్షాలకు నీరు పెట్టుతున్నారేం? చెరువులో అంత నీరుండగా పొలాలు ఎండిపోవలసిన ఖర్మ ఏం పట్టింది?'' అని అడిగాడు.

''చెరువులో నీళ్లు మా పొలాల కెలా వస్తాయి, బాబూ? చెరువు జమీందారుది; పొలాలు మావి. ఆ చింతచెట్లూ, మామిడి చెట్లూ కూడా జమీందారువే. వర్షం కురిస్తే గాని మా పొలాలు పండవు. ఏం చెయ్యాలి?'' అన్నారు రైతులు.

చిన్నడికి ఒళ్లు మండిపోయింది.

''మీరు వట్టి వెర్రివాళ్లలా ఉన్నారు, చెరువు జమీందారుదైతే, అందులో ఉన్న నీరు అతని తాత పంపిస్తున్నాడా?'' అని చిన్నడు అడిగాడు.

''జమీందారు తాతకేం, బాబూ? మహా దాత! మా పొలాలు తడిసినాకనే తన పొలాలకు నీరు పెట్టుకునేవాడు. ఒక్కొక్కసారి, పాపం, తన పొలాలు ఎండిపోయినా చూస్తూ ఊరుకునేవాడు.

బూర్లె నాగేశ్వరరావు



ఆ రావుబహదూర్ కొడుకు రాజారాం బహదూర్ తన పొలాలకు చాలగా మిగిలిన నీరు మమ్మల్ని పెట్టుకోనిచ్చే వాడు. ఇప్పుడు ఉన్న జమీందారు ఆయన కొడుకు. ఈయనగారి హయాంలో ఎలా వున్నదీ నువు చూస్తున్నావుగా! చుక్క రానియ్యడు! మా బతుకులు చింతచెట్లకన్నా హీనమయిపోయాయి!'' అన్నారు రైతులు.

ఈ మాటలు వింటూంటే చిన్నడికి కడుపులో దేవినట్టయింది. వాడు రెండు రోజులు ఊళ్ళో ఉండి, జమీందారు గురించి వాకబు చేశాడు. జమీందారు ప్రవర్తనకు ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు. అతనికి ఇంగిత జ్ఞానం తక్కువ, మూర్ఖపు చాదస్తం ఎక్కువ. నయానో భయానో జమీందారు వైఖరి మార్చి, ఊరివాళ్ళకు ఉపకారం చెయ్యవచ్చునని చిన్నడు అనుకున్నాడు.

తన చెరువు నీళ్లు దొంగచాటుగా రైతులు తమ పొలాలకు పెట్టుకుంటు న్నారేమోనన్న అనుమానంతో, జమీందారు ప్రతిరోజూ చెరువుగట్టున వెళుతూ, ఎండి పోతున్న రైతుల పొలాలనూ, పచ్చగా ఉన్న తన పొలాలనూ తిలకిస్తూ, ఆనందించేవాడు.

ఒకరోజు జమీందారు వచ్చే వేళకు, చిన్నడు కాషాయవస్త్రాలూ, గడ్డాలూ, మీసాలూ, మెడలో రుద్రాక్షలూ ధరించి, మొలలోతు నీటిలో నిలబడి, చెంబుతో చెరువునీరు ముంచి తీసి పరీక్షించి, తిరిగి ఒలకబోస్తూ కనిపించాడు. అతను చేస్తున్న పని చూసి, జమీందారు ఆశ్చర్య పోయాడు. ఎంతసేపటికీ చిన్నడు నీరు తీసి చూసి, ఒలకబోయటం మానకపోయే సరికి కుతూహలం కలిగి, జమీందారు చిన్నణ్ణి సమీపించి కొంచెం పరిహాసంగా, ''ఏయ్ సన్యాసీ! ఏమిటి . నీళ్ళలో దేవులాడుకుంటున్నావు? ఏం పారేసు కున్నావు అందులో?'' అని అడిగాడు.

సన్యాసి చిరునవ్వుతో, ''అవును

బాబూ! చెంబెడు కొత్తనీటికోసం వెతుకు తున్నాను. కాని యీ చెరువులో చాలా భాగం పాత నీరులాగే ఉంది. ఆ లోకం నుంచి నడిచివచ్చిన నా శ్రమ అంతా వృథా అయిపోయింది. ఎందుకంటే, ఆకాశంలో వేళ్లాడుతున్న ఒక పాపిని ఈ చెరువులోని కొత్తనీటితో స్వర్గానికి పంప వలసి ఉన్నది,'' అంటూ వెళ్లిపో బోయాడు.

జమీందారు కుతూహలం కంగారుగా మారింది. అతను చిన్నడిని వెళ్లిపో నియ్యక, ''అయ్యా, ఆకాశంలో పాపి వేళ్లాడటమేమిటి? కొత్త నీ రేమి టి? ఆ పాపికీ, ఈ చెరువుకూ ఏమిటి సంబంధం? మీరు ఆ లోకం నుంచి నడిచి రావటమేమిటి? దయ చేసి విపులంగా చెప్పండి,'' అన్నాడు.

దానికి చిన్నడు ఇలా చెప్పాడు :

''నేను పరలోకవాసిని. స్వర్గంనుంచి వస్తున్నాను. ఈ చెరువు యజమాని రామచంద్ర బహదూర్ అటు స్వర్గానికీ, ఇటు నరకానికీ కాకుండా, ఆకాశంలో వేళ్లాడుతూ హైరానాపడి పోతున్నాడు. స్వర్గంలో ఉన్న అతని తండ్రి రావు బహదూర్ తన కొడుకు దుస్థితికి విచార పడి, ఈ చెరువులో ఉండే కొత్త నీరు చెంబెడు తెచ్చి ఆ పాపిమీద చల్లి



నట్టయితే, అతను స్వర్గానికి రావచ్చునని దేవతల అనుమతి పొంది, ఆ పని చెయ్యటానికి నన్ను పంపాడు. కాని ఇప్పటి జమీందారు మహాపాపిలా ఉన్నాడు! చెరువు కింది పొలాలు ఎండి పోతున్నా, గత సంవత్సరపు నీరంతా చెరువులోనే నిలవచేశాడు ఈ పాపి గతి ఏం కానున్నదో మరి?''

జమీందారు భయంతో కంపించిపోతూ, ''అయ్యా, ఈ చెరువు నీటిలో అంత మహత్తు ఉన్నదా?'' అన్నాడు.

''దీని మహత్తు నీకు తెలియదు. ఇందులోకి వచ్చే నీటిలో హిమాలయ పర్వతాల పవిత్ర జలం కలుస్తుంది.

అందుకే చచ్చిపోయిన ఇద్దరు జమీందార్ల పాప పుణ్యాలు దీనిమీద ఆధారపడి వున్నాయి. రావు బహదూర్ హయాంలో ఆయన ఇందులోని నీళ్లు రైతుల పొలాల కిచ్చి, మిగిలిన నీరే తన పొలాలకు పెట్టుకునేవాడు. తన పొలాలు పండక పోయినా, రైతుల పొలాలు పండితే చాలుననుకునేవాడు. బతికినన్నాళ్లూ ధర్మదాతగా పేరు పొంది, చచ్చి ఉత్తముడుగా స్వర్గానికి వచ్చాడు' తరవాత, అతని కొడుకైన రామచంద్ర బహదూర్ స్వార్థపరుడు; తన కడుపు నిండినాకనే ఇతరులను తిననిచ్చే స్వభావం గలవాడు; తన పొలాలకు నీరు సరిపడితేనే ఇతరుల పొలాలకు ఇచ్చే వాడు. ఆ కారణంచేత అతను స్వర్గానికీ కాకుండా, నరకానికీ కాకుండా మధ్యలో వేళ్లాడుతున్నాడు. రావు బహదూర్ ఉత్తముడు, రామచంద్ర బహదూర్ మధ్యముడు, ఇప్పుడున్నవాడు అధ ముడు అన్నాడు.

వెంటనే జమీందారు చిన్నడి కాళ్లమీద పడి, "నేనే, బాబూ, ఆ అధముణ్ణి!,నేను స్వర్గానికివెళ్లేఉపాయంచెప్పు," అన్నాడు.

చిన్నడు జమీందారును లేవనెత్తి, "భయపడకు! పాపభీతి ఉంటే చాలు, అన్ని పాపాలూ పోతాయి. నేను చెప్పినట్టు చేశావంటె, నువే కాకుండా నీ తండ్రి కూడా స్వర్గానికి వెళ్లగలడు. చూడు, మీ తాత చేసిన పుణ్యం అతన్ని స్వర్గానికి లాగుతుంటే, నువు చేసిన పాపం అతన్ని నరకంకేసి లాగుతున్నది. ఇప్పుడు నువ్వు ఎన్నో పుణ్యకార్యాలు చేస్తేగాని మీ తండ్రికీ, నీకూ విమోచనం కలగదు. గతాన్ని మరిచిపో, కొత్త జీవితం ప్రారంభించు.ఈ చెరువులో_నీరు రైతుల పొలాలకు విడుదల చెయ్యి" అన్నాడు.

తరవాత త్వరలోనే జమీందారు ధర్మ దాతగా పేరు తెచ్చుకున్నాడు. అతడి చెరువులో ఏటా కొత్తనీరే ఉంటూ వచ్చింది.






# పదహారువేల రూపాయలు

గన్నవరంలో గవర్రాజు ఒక గృహస్థు. వెంకటేశం, శోభనాద్రీ అని ఆయనకు ఇద్దరు స్నేహితులు ఉండేవారు.

గవర్రాజు ధనవంతుడు. ఈ సంగతి కనిపెట్టి వెంకటేశం, శోభనాద్రీ ఆయనతో స్నేహంచేశారు; "మీ డబ్బును పెట్టెలో పెట్టిదాస్తే యేమిటిలాభం? దాన్ని పెట్టుబడిగా పెట్టి వ్యాపారం చేస్తే. రూపాయకు పది రూపాయల చొప్పున లాభం వస్తుంది," అని సలహా చెప్పారు.

"నాకు ఏ వ్యాపారమూ చేతకాదు," అన్నాడు గవర్రాజు.

"మీరు పెట్టుబడి పెట్టండి. వ్యాపారమంతా మేము నడుపుతాము," అన్నారు వెంకటేశం, శోభనాద్రీ.

గవర్రాజుగారి సొమ్ముతో వ్యాపారం ప్రారంభ మయింది. స్నేహితుల నిద్దరినీ నమ్మి, ఆయన అంతా వాళ్ళపైన వదిలి పెట్టేశాడు. వాళ్లు అసలూ, లాభమూ అపహరించివేసి, వ్యాపారంలో నష్టం వచ్చిందని చెప్పి, ఆయనను దివాలా తీయించారు.

తన సొమ్ము అపహరించి, చెరివొక ఐదువేలూ బ్యాంకులో వేసుకున్నారని గవర్రాజుగారికి ఆఖరునగాని తెలిసింది కాదు. వాళ్లు తనకు ద్రోహం చేశారని తెలిసికూడా ఆయన వాళ్లనేమీఅనలేదు. వాళ్లను ఎప్పటిలాగానే స్నేహభావంతోనే చూస్తూ వచ్చాడు.

కొంత కాలానికి ఆయనకు జబ్బుచేసి మంచం పట్టాడు. ఇంక ఎన్నాళ్లో బ్రతకనని తోచి, ఆయన శోభనాద్రిని రమ్మని కబురు పంపించాడు. అతడు రావటంతోనే ఆయన, "శోభనాద్రీ! నువ్వు నాకొక ఉపకారం చేసిపెట్టాలోయ్," అన్నాడు.

"ఏమిటి?" అని అడిగాడు శోభనాద్రి.



''నా రోజులు దగ్గిరపడ్డాయి. నేను పోయే ముందు, ఏ సొమ్ము ఎక్కడ ఉన్నదీ నా భార్యకు చెప్పవలసిన సమయం వచ్చింది. కాని, మా ఆవిడ వట్టి దుబారా మనిషి. సొమ్ము చేతికివస్తే మూడు నిమిషాలలో ఖర్చుచేసేస్తుంది,'' అన్నాడు గవర్రాజు.

ఆయన వద్ద ఇంకా సొమ్ము ఉందని తెలవటంతో శోభనాద్రికి నోరూరింది. 'ఇన్నాళ్ళనుంచి చెప్పాడు కాడే!' అనుకుని, ''నిజమే. ఆడదానిచేతి అర్థమూ, మగవానిచేతి బిడ్డా మన్నవు, అన్న సామెత ఊరికే పుట్టిందా?'' అన్నాడు.

''వ్యాపారంలో పోయింది పోగా, నా వద్ద ఇంకా పదహారు వేలదాకా వుంది. ఆ రూపాయలను వెయ్యి వెయ్యి చొప్పున ముంతలలో పోసి, మా యింటి నాలుగు గదులలోనూ ఒక్కొక్క ముంతఒక్కొక్క మూలని పాతిపెట్టాను. పదహారు ముంతలున్నాయని నా భార్యకు ఒక్కమాటుగా తెలియనివ్వకూడదు. నువ్వు చెయ్యవలసిన ఉపకార మేమిటంటే,'' అని ఊరుకున్నాడు గవర్రాజు.

''చెప్పండి, చెప్పండి!'' అంటూ తొందరపెట్టాడు శోభనాద్రి.

''మధ్య మధ్య మా ఇంటి పరిస్థితులు కనుక్కొని వెడుతూవుండు. నా భార్య డబ్బులేక ఇబ్బంది పడుతోంది అని తెలియటంతోనే, ఒక ముంత మాట చెప్పి, ఆ సొమ్ము తవ్వుకోమను. ఆ సొమ్ము అయేవరకూ దానికి తక్కిన ముంతల మాట చెప్పవద్దు,'' అన్నాడు గవర్రాజు.

''ఈ ముంతల రహస్యం నువ్వు ఎవ్వరికీ తెలవనివ్వకూడదు. వెంకటేశానికి కూడా చెప్పకు. వాడంటే నాకు నమ్మకం పోయింది. అందుకే నీతోచెప్పి, ఈ ఉపకారం చెయ్యవలసిందని కోరుతున్నాను,' అని కూడా అన్నాడు గవర్రాజు.

''తప్పకుండా చేస్తాను. మీరు నన్ను నమ్ముకుని ఇంక నిశ్చింతగా ఉండవచ్చు. ఈపాటి దానికేనా ఇంత ఆత్రం!'' అని

చెప్పి శోభనాద్రి వెళ్లిపోయాడు.

ఆ సాయంత్రమే గవర్రాజుగారు రెండవ స్నేహితుడైన వెంకటేశాన్ని రప్పించి, ఆ ముంతల రహస్యాన్ని వాడితో కూడా చెప్పి, శోభనాద్రిని కోరినట్లే, ''ఈ ఉపకారం నాకు నువ్వు చెయ్యాలి. ఈ రహస్యాన్ని నువ్వు శోభనాద్రికికూడా తెలవనివ్వ కూడదు. వాడంటే నాకు నమ్మకం లేకనే, నీకు కబురు చేయించాను,'' అన్నాడు.

''వాడి కెందుకు తెలవనిస్తాను?.... ఇంక మీరు నిశ్చింతగా ఉండవచ్చు. వ్యవహారమంతా నేను చూసుకుంటాను," అని నమ్మకంగా అన్నాడు వెంకటేశం.

కొన్నాళ్లయాక గవర్రాజుగారి భార్య కావమ్మగారు శోభనాద్రితో, "డబ్బుకి చాలా ఇబ్బందిగా వుంది. ఒక్క పాతిక రూపాయలు బదులు కావాలి," అని అడిగింది.

''నా దగ్గిర సొమ్ము ఎక్కడిది? అంతేగాకుండా మీరు మాత్రం అప్పుచేసి ఎన్నాళ్లు గడపగలరు? మీ యిల్లు అమ్మేస్తే ఒక వెయ్యి రూపాయలు వస్తుందే. అలా చెయ్యకూడదా?" అన్నాడు శోభనాద్రి.

''నాకీ ఆలోచన తోచిందికాదు. అమ్మేటట్లయితే రాత్రి నిశ్చయించుకు



చెబుతాను," అన్నది ఆవిడ.

ఈ సంగతి ఇలా ఉండగా, ఆ సాయంత్రమే వారింటికి వెంకటేశం వెళ్లాడు. ''శోభనాద్రి ఇల్లు అమ్మితే వెయ్యి రూపాయలు వస్తుందన్నాడు," అని ఆవిడ ఆ సంగతి అతడితో చెప్పింది.

అందుకు వెంకటేశం, ''వెయ్యేమిటి? మీరే అమ్మదలుచుకుంటే, పదిహేను వందలిస్తాను," అన్నాడు.

మర్నాడు ప్రొద్దుట మళ్ళీ వచ్చిన శోభనాద్రితో, కావమ్మ వెంకటేశం సంగతి చెప్పింది. ''నేను రెండు వేలిస్తాను," అన్నాడు శోభనాద్రి.

పదహారు వేల రూపాయలు ముంత

లలో వున్న ఇంటిని రెండువేలిచ్చి కొంటే నష్టమేమిటి గనుక? మామూలు ప్రకారం ఆ సాయంత్రం వచ్చిన వెంకటేశం రెండువేల ఐదువందల వరకూ ఇస్తానన్నాడు. ఈ విధంగా రోజు రోజుకీ వాళ్లిద్దరి మధ్యా పోటీ వచ్చి, పాట పెరిగింది. ఆఖరికి శోభనాద్రి పదివేలు ఇస్తానన్నాడు.

వెంకటేశం 'ఇంకా ఏమైనా ధర పెంచుతాడేమో అని చూచింది కావమ్మగారు

వెంకటేశం ధర పెంచలేదు. అతడు శోభనాద్రిని కలుసుకుని, "ఏమిరా, ఆ యింటికి పదివేలిస్తానన్నావుట! ఏం పాముకుందామని?" అన్నాడు.

"నువ్వేం పాముకుందామని ధర పెంచావు?" అని ముదలకించాడు శోభనాద్రి.

వాళ్లు ఒకళ్ల నొకళ్ళు చూసి చిరునవ్వు నవ్వుకున్నారు. అసలు రహస్యం వాడికెలాగో తెలిసిపోయిందని వీడూ, వీడికెలాగో తెలిసిపోయిందని వాడూ గ్రహించారు. ఆఖరికి వెంకటేశం "పది వేలు ఎక్కడనుంచి తెస్తావు? బ్యాంకులో నీకు ఐదు వేలే కదూ ఉన్నాయి?" అన్నాడు

"నీకు కూడా బ్యాంకులో ఐదు వేలున్నాయిగా? ఆ సొమ్ము నాకు బదులియ్యి," అన్నాడు శోభనాద్రి.

"అదేమీ కుదరదు. నీ ఐదువేలూ, నా ఐదువేలూ చేర్చి, ఆ యింటిని మనిద్దరి పైనా రాయించుకుందాం," అన్నాడు వెంకటేశం.

"సరే," అన్నాడు శోభనాద్రి.

గవర్రాజుకు ద్రోహంచేసి అపహరించిన పదివేలూ తెచ్చి, వాళ్లిద్దరూ కావమ్మగారికి యిచ్చి, ఇల్లు రాయించుకొన్నారు.

తరువాత వాళ్లిద్దరూ చెరి ఒక గునపం చేతపుచ్చుకుని గది మూలలు తవ్వటం మొదలెట్టారు ఎంత తవ్వినా ఒక్క ముంతయినా కనిపిస్తేగా!





# చ్యవనుడు

చ్యవనుడు భృగుడికీ, పులోమకూ పుట్టినవాడు. అతను అతి దీర్ఘ తపస్సు చేస్తూ ముసలివాడైపోయాడు. అతని చుట్టూ పుట్టలేచింది.

శర్యాతి అనేరాజు, వైవస్వత మనువు కొడుకు, తన పరివారంతోనూ, తన కుమార్తె సుకన్యతోనూ వనవిహారం చేస్తూ, చ్యవనుడు తపస్సుచేసుకునే ప్రాంతానికి వచ్చాడు. సుకన్య, చ్యవనుడి చుట్టూ లేచిన పుట్ట నుంచి కాంతికిరణాలు వస్తూండటం చూసి, భటులచేత ఆ పుట్టను తవ్వించింది.

తపోభంగం చేసినందుకు సుకన్యనూ, ఆమె తండ్రినీ, అతని పరివారాన్నీ చ్యవనుడు శపించాడు. తన కుమార్తె అమాయకురాలనీ, అజ్ఞానం చేత అలా చేసిందనీ శర్యాతి బతిమాలగా, ఆమెను తనకిచ్చి పెళ్ళిచేసినట్టయితే శాపం ఉపసంహరిస్తానన్నాడు చ్యవనుడు. శర్యాతి సుకన్యను ముసలివాడైన చ్యవనుడికి ఇచ్చి పెళ్లిచేశాడు.

చ్యవనుడు అమిత కోపస్వభావుడు. అయినా సుకన్య అతనికి శ్రద్ధగా సేవలు చేసి, అతని మెప్పు సంపాదించింది.

ఒకసారి అశ్వినీదేవతలు చ్యవన మహర్షి ఆశ్రమం మీదుగా పోతూ, సుకన్యను చూసి, "అమ్మా, యౌవనవతివి అయి ఉండి, ఈ ముసలి భర్తతో ఎందుకు కాపరం చేస్తావు? మా వెంటరా, నీకు యువకుడైన భర్తను చూపుతాము," అన్నారు.

వాళ్ళు అన్నమాటలను సుకన్య చ్యవనుడితో చెప్పింది. చ్యవనుడు ఆగ్రహించక, సుకన్యతో, "వాళ్ళు చెప్పినట్టే చెయ్యి," అన్నాడు. అయితే అతను అశ్వినులతో, "నన్ను యౌవనవంతుణ్ణి

చేశారంటే, శర్యాతి చేయబోయే యజ్ఞంలో మీకు సోమపానం ఇప్పిస్తాను,'' అన్నాడు.

అశ్వినులు అందుకు ఒప్పుకుని, చ్యవనుణ్ణి దగ్గిరలో ఉన్న ఒక కొలనులో మునగమన్నారు. అతను కొలనులో మునిగినప్పుడు అశ్వినులిద్దరూ అతనితో బాటు కొలనులో మునిగారు. తరవాత కొలనులో నుంచి ముగ్గురు యువకులు లేచారు. వారు ముగ్గురూ ఒక్క విధంగానే ఉండి, ''నీకు కావలసిన యువకుణ్ణి ఎన్నుకో,'' అని సుకన్యతో అన్నారు.

సుకన్య చ్యవనుణ్ణే ఎన్నుకున్నది.

ఇంతలో శర్యాతి యజ్ఞం చెయ్యటానికి ఏర్పాట్లన్నీ చేసుకుని, తన కూతురినీ, అల్లుణ్ణీ తీసుకు పోవటానికి వచ్చి, తన కూతురు ముసలివాడితో కాక, పడుచు వాడితో కాపరం చేస్తూ ఉండటం చూసి, చేయరానిపని చేసిందని దుఃఖించాడు.

అయితే సుకన్య తన తండ్రికి జరిగినదంతా చెప్పి, అతని విచారం పోగొట్టింది. తరవాత చ్యవనుడు శర్యాతి చేత యజ్ఞం చేయించి, అందులో అశ్వినులకు యజ్ఞ భాగం ఇప్పించాడు. అర్హతలేని అశ్వినులకు యజ్ఞభాగం ఇప్పించాడని ఇంద్రుడు కోపగించి, చ్యవనుడి మీదికి వజ్రాయుధం ఎత్తాడు. చ్యవనుడి శక్తితో ఇంద్రుడు ఎత్తిన చెయ్యి మరిదిగలేదు.

తరవాత చ్యవనుడు ఇంద్రుడి మీద అనుగ్రహించి, అతని చేతికి విమోచనం కలిగించాడు.

చ్యవనుడు గంగా యమునా సంగమంలో మునిగి తపస్సు చేసుకుంటూ, చేపల కోసం జాలర్లు విసిరిన వలలో పడ్డాడు. జాలర్లు అతనికి క్షమాపణ చెప్పుకున్నారు. కాని అతను, ''మీ వలలో పడినది మీసొమ్మే! నన్ను కూడా చేపలతో బాటు అమ్ముకోండి,'' అన్నాడు.

జాలర్లు చ్యవనుణ్ణి నహుషరాజు వద్దకు తీసుకుపోయి, అతనికి విలువ కట్ట మన్నారు. బ్రాహ్మణుడి విలువా, గోవు విలువా ఒకటేనని నహుషుడు జాలర్లకు గోవునిచ్చి పంపాడు.





# పరశురాముడు

హైహయవంశానికి చెందిన కార్త వీర్యుడు అనే రాజు అరణ్యంలోకి వేటకు వెళ్ళి, అక్కడ ఉండిన జమదగ్ని మహాముని ఆశ్రమాన్ని అకారణంగా, మదం కొద్దీ, ధ్వంసంచేశాడు.



అప్పుడు జమదగ్ని కొడుకు పరశురాముడు ఆశ్రమంలో లేడు. అతను వచ్చి జరిగినది చూసి, తన గండ్రగొడ్డలితో వెళ్ళి రాజభవనంలో కార్తవీర్యుడి శిరస్సు నరికేశాడు.



మర్నాడు కార్తవీర్యుడి కొడుకులు జమదగ్ని తపస్సమాధిలో ఉన్న చోటికి వచ్చి, ఆయనను చంపారు. అప్పుడు కూడా పరశురాముడు అక్కడ లేడు.



మర్నాడు పరశురాముడు తన గండ్ర గొడ్డలితో కార్తవీర్యుడి కొడుకులను ప్రతిఘటించి, అందరినీ చంపాడు. బ్రాహ్మణుడైనా అతని ధాటికి ఆ క్షత్రియులు నిలువలేకపోయారు.



తండ్రి వధకు పగతీర్చుకున్న పరశురాముడు అంతటితో ఆగక, క్షత్రియులందరూ క్రూరులనీ, దుష్టులనీ భావించి, క్షత్రియ జాతినే నిర్మూలించ బూనుకున్నాడు.



పరశురాముడు ఇరవై ఒక్క సారి క్షత్రియవంశ నిర్మూలనం చేసి, క్షత్రియ రక్తంతో ఎర్రబారిన మడుగు వద్ద తన తండ్రికి జలతర్పణాలు విడిచాడు.



తరవాత అతను గొప్పయజ్ఞంచేసి, తాను క్షత్రియులను చంపి గెలుచుకున్న భూమండల మంతా కశ్యపుడికి దానం చేసి, మహేంద్రగిరి మీద తపస్సు చేసుకో బోయాడు.



ప్రపంచానికి క్షత్రియుల పీడనపోయినా రాకాసుల బెడద పోలేదు. వాళ్ళు విజృంభించి, ప్రజలను రకరకాల బాధించసాగారు.



పరశురాముడికి ఈ సంగతి తెలిసింది. అతను శివుణ్ణి ప్రార్థించి, రాకాసులను సంహరించటానికి తగిన శక్తులను పొంది, మహేంద్రపర్వతం నుంచి దిగాడు.



శివుడి అనుగ్రహంతో మరింత శక్తి సంపన్నుడైన పరశురాముడు రాక్షసులను ఊచకోత కోసి, ప్రపంచానికి రాక్షసభయం పోగొట్టాడు.

అ సమయంలో యువకుడుగా ఉన్న రాముడు శివధనువును విరిచి, సీతను పెళ్ళాడాడు. అతను జనకుడి మిథిల నుంచి తిరిగివస్తున్నాడు.





అప్పుడు పరశురాముడు రాముణ్ణి ప్రతిఘటించి, తన వద్ద ఉన్న విష్ణు ధనువును ఎక్కుపెట్టమని సవాలు చేశాడు. రాముడు దాన్ని అవలీలగా విరిచాడు. తనలాటి అవతారమే రాముడని గ్రహించి పరశురాముడు తన శక్తులన్నీ రాముడికి ధారపోసేశాడు.



# గరుత్మంతుడు

కశ్యపుడి భార్య అయిన వినత కొడుకు గరుత్మంతుడు. మరొక భార్య అయిన కద్రువకూ, ఆమె కొడుకులైన నాగులకూ గరుత్మంతుడు సేవ చేసేవాడు. ఒకసారి అతను నాగులను తన వీపు మీద ఎక్కించుకుని ఆకాశంలో ఎగురుతూంటే నాగులు ఎండ వేడికి తట్టుకోలేక కింద పడ్డారు. అందుకు కద్రువ గరుత్మంతుణ్ణి మందలించింది.

అప్పుడు గరుత్మంతుడు తన తల్లితో, "అమ్మా, నేను అంతులేని బలంగల వాణ్ణి అయి ఉండి కూడా కద్రువకూ, ఆమె కొడుకులకూ ఎందుకు దాస్యం చేస్తున్నాను?" అన్నాడు. తాను ఒకప్పుడు కద్రువతో పందెం వేసి ఓడిపోయిన కారణంగా తనకూ, గరుత్మంతుడికీ దాస్యం సంప్రాప్తమయిందని ఆమె చెప్పింది.

గరుత్మంతుడు కద్రువను, "నన్నూ, నా తల్లినీ నీ దాస్యంలో ఉంచటం భావ్యం కాదు. మమ్మల్ని దాస్య విముక్తుల్ని చెయ్యి." అని అడిగాడు.

దానికి కద్రువ, "నువు నాకు అమృతం తెచ్చి ఇస్తే మిమ్మల్ని విడిచిపెట్టుతాను," అన్నది.

గరుత్మంతుడు అందుకు ఒప్పుకుని, అమృతం తీసుకురావటానికి పోతున్నానని తల్లికి చెప్పి, దేవలోకానికి వెళ్ళాడు. అమృతాన్ని అనేకమంది రక్షిస్తున్నారు. అమృతభాండం చుట్టూ అగ్ని ఉన్నది. అమృతభాండం పైగా ఒక చక్రం తిరుగుతున్నది. భాండాన్ని రెండు మహాసర్పాలు కనిపెట్టి ఉన్నాయి.

గరుత్మంతుడు అమృత రక్షకులతో యుద్ధంచేసి చంపి, అగ్నిని ఆర్పి, ఉపాయంగా చక్రం కింద దూరి, పాములను

చావగొట్టి, అమృతం తీసుకుని తిరుగు ప్రయాణమయాడు. ఈ సంగతి విని ఇంద్రుడు గరుత్మంతుడి పైన వజ్రాయుధం విసిరాడు. దాని దెబ్బకు గరుత్మంతుడి ఈక ఒక్కటి మాత్రం రాలిపడింది. గరుత్మంతుడితో యుద్ధం సాధ్యం కాదని గుర్తించి, ఇంద్రుడు అతనితో సంధి చేసుకుని, అమృతాన్ని ఎవరికీ ఇయ్యవద్దని కోరాడు.

"నా తల్లికి దాస్య విముక్తి కలిగించటానికి ఈ అమృతాన్ని కద్రువ పిల్లలకు ఇయ్యక తప్పదు. అయితే వారు దాన్ని తాగే లోపల తిరిగి తీసుకు వస్తాను," అన్నాడు గరుత్మంతుడు.

అతను ఆ ప్రకారమే అమృతభాండాన్ని కద్రువ కొడుకుల ముందు దర్భలపైన పెట్టి, తన తల్లి దాసి కాదని సవతితల్లి చేత ఒప్పించి, కద్రువ కొడుకులైన పాములు అమృతం తాగేలోపల అమృత భాండాన్ని తిరిగి స్వర్గం చేర్చాడు. అప్పుడు పాములు అమృతం అంటి ఉంటుందన్న ఆశతో దర్భలను నాకగా, నాలుకలు చీలాయట.

గరుత్మంతుడి శక్తి సామర్థ్యాలను దేవతలందరూ గొప్పగా కొనియాడారు. విష్ణువు అతన్ని తన వాహనంగా ఉండమని కోరాడు. ఇంద్రుడతనికి పాములను ఆహారం చేసుకునేటట్టు వరం ఇచ్చాడు.

ఇంద్రుడి సారథి అయిన మాతలికి గుణకేశి అనే కూతురు ఉండేది. ఆమెను సుముఖు డనే నాగకుమారుడికి ఇచ్చి పెళ్లి చేయాలనుకున్నాడు మాతలి. అయితే గరుత్మంతుడు ఈ సుముఖుణ్ణి త్వరలోనే తినబోతున్నట్టు ప్రతిజ్ఞ చేశాడని విని, మాతలి ఇంద్రుడూ, విష్ణువూ ఉన్న చోటికి వెళ్లి, సుముఖుణ్ణి చిరాయువు చెయ్యమని కోరాడు. ఇంద్రుడు సరేనన్నాడు. గరుడుడు మండిపడి, పొగరుగా మాట్లాడాడు. విష్ణువు, "నీ శక్తి ఏపాటిది?" అని తన చెయ్యి గరుత్మంతుడి పైన పెట్టాడు. గరుత్మంతుడు దాని బరువు భరించలేక, గర్వం విడిచి పెట్టాడు.





# మృతుడి వివాహం

నందినీ నదీతీరాన, యాభైమైళ్ళఎడంలో రుద్రపురమూ, దేవగిరీ అనే రాజ్యాలు ఉండేవి. రుద్రపుర రాజకుమార్తె రూపమతిని దేవగిరి రాజు దేవపాలుడు పెళ్లాడాడు. అయితే వారికి సంతానప్రాప్తి లేకపోవటంచేత, హితుల సలహామీద దేవపాలుడు కాళింది అనే ఆమెను పెళ్లాడాడు. కాళింది అసూయాపరురాలూ, దుర్మార్గురాలూనూ. కాని కాళిందికి కూడా సంతానం కలగలేదు.

ఇలా ఉండగా ఒకసారి దేవపాలుడు వేటకై అరణ్యానికిపోయి, వేటతమకంలో పరివారానికి దూరమై, దారితప్పి, చీకటి పడుతూండగా ఒక కుటీరం చేరాడు. అందులో ఒక యోగి ఉంటున్నాడు. ఆ యోగి దేవపాలుడికి ఆతిథ్యమిచ్చి, అతనికి సంతానం లేదని తెలుసుకొని, ఒక బంగారు గొలుసు ఇచ్చి, ''దీన్ని నీ పెద్ద భార్య మెడలో తీయకుండా ఉంచమను. ఆమె గర్భవతి అవుతుంది. కాలక్రమాన ఆమె ఒక కొడుకును కంటుంది. అప్పుడా గొలుసు ఆ పిల్లవాడి మెడలో వెయ్యాలి ఏ పరిస్థితులలోనైనా దాన్ని వాడి మెడనుంచి తీస్తే వాడు చచ్చిపోయినట్టుగా అయిపోతాడు, తిరిగి దాన్ని వాడి మెడలో వేస్తేగాని లేవడు,'' అని చెప్పాడు.

దేవపాలుడు ఆ యోగి యిచ్చిన గొలుసును తెచ్చి రూపమతి మెడలో వేశాడు. రూపమతి త్వరలోనే గర్భవతి అయి, సకాలంలో ఒక చక్కని మగబిడ్డను కన్నది. కాని ఆ బిడ్డలో ప్రాణంఉన్నట్టు కనబడలేదు. రూపమతి మెడలోని గొలుసు ఆ బిడ్డ మెడలో వెయ్యగానే వాడు ఏడ్చి, ప్రాణం ఉన్నట్టు కనబడ్డాడు.



తన సవితి గర్భవతి అయినదిమొదలు కాళింది ఈర్ష్యతో కుమిలిపోతున్నది. ఆ గొలుసును తన భర్త తన మెడలోవెయ్యనందుకు ఆమె భర్తను క్షమించలేదు. తన చిన్నభార్య వైఖరి గమనించి, దేవపాలుడు తన కొడుకును ఆమె నుంచి కాపాడటానికి చేయువలసిన కట్టుదిట్టాలన్నీ చేసి, పిల్లవాడికి గోలాపకుమారుడని పేరు పెట్టుకున్నాడు.

గోలాపుడు తన సవతితల్లి బారిన పడకుండా పెరిగి పద్దెనిమిదేళ్ళ వాడయాడు.

ఇంతలో దేవపాలుడు మరణించాడు, రాజభవనమంతా శోకసముద్రంలో మునిగిపోయి ఉన్నది. రాజుగారి అపర కర్మ జరిగే కాలంలో గోలాపుడి రక్షణఏర్పాట్లు పూర్తిగా సడలిపోయాయి. ఆ సమయంలో ఒకరాత్రి కాళింది, గోలాపుడు నిద్రలో ఉండగా అతని మెడలోని గొలుసు తీసి దాచి, అతడు శవప్రాయుడై పడిపోగానే, గట్టిగా ''పాము, పాము!'' అని అరిచి అందరినీ లేవగొట్టింది. చచ్చిపోయినట్టు పడివున్న గోలాపుణ్ణిచూసి, అతను పాము కాటుకు మరణించాడంటే అందరూ నమ్మారు.

మర్నాడు కాళింది మంత్రిని పిలిచి, గోలాపుడి దహనక్రియలు చేయించమని అడిగింది. భర్తపోయిన శోకానికి పుత్రశోకం జతఅయి దుర్భరమైన మనోవేదన పొందుతున్న రూపమతి తన కొడుకు మెడలో గొలుసు లేకపోవటం గమనించి మంత్రితో తన కొడుకు నిజంగా చచ్చిపోలేదనీ, కాళింది ఎలాగో అతని మెడలో ఉండే గొలుసు కాజేసి, కుర్రవాడికి కృత్రిమంగా చావు తెప్పించిందనీ అన్నది. మంత్రి కాళిందిని ఆ గొలుసు గురించి అడిగాడు, కాని దాని సంగతి తనకు తెలియదన్న దామె.

మంత్రి కాళిందితో గోలాపుడి దహనం అర్ధరాత్రివేళ రహస్యంగా జరిగితేబాగుంటుందనీ, అతను పాముకరిచి చనిపోయాడంటే జనం నమ్మకుండా ఉన్నారనీ

మర్నాడు సావిత్రి వచ్చినప్పుడు కాళింది, "నీ మందు ఏమాత్రమూ పని చేసినట్టులేదు," అన్నది.

సావిత్రి ఆశ్చర్యంగా ఆమెకేసి చూసి, "ఆ మెడలో ఏమిటి ?" అంటూ దగ్గరికి వచ్చి, మెడలో గొలుసు తానే తీస్తూ, "ఈ బంగారం వంటిమీద ఉండగా నామందు ఎలా పనిచేస్తుంది ?" అంటూ తన సంచీ నుంచి ఒక కాగితం సంచీ తీసి, గొలుసును అందులో వేసి, తాడుతో సంచీ మూతి గట్టిగా బిగించి, తన పక్కనే పెట్టుకున్నది.

సావిత్రి చేసినపని కాళిందికి ఏమాత్రం నచ్చలేదు. ఆమె తన పాదానికి మందు పూయించుకుంటున్నంత సేపూ ఆ కాగితపు సంచినే చూస్తూ ఉండిపోయింది.



సావిత్రి మందుపూయటం పూర్తిచేసి, కాగితపు సంచిని తన మందుల సంచిలో పెట్టేసుకుంటూ, "ఇక చూడండి, నా మందు మహాత్మ్యం!" అన్నది.

"నా గొలుసు! దాన్ని నువ్వు తీసేసుకున్నావేమిటి?" అన్నది కాళింది ఆవేదనతో.

"దేవీ, ఆ కొద్దిపాటి బహుమతికి నేను తగనా ?" అన్నది సావిత్రి అమాయకంగా.

"వ్రణం నయం అయాక అంతకు పదింతలు బహుమానం ఇస్తాను. ముందు అది నాకు ఇచ్చెయ్యి," అన్నది కాళింది.

"తమకు నా వైద్యంలో గురి లేదన్న మాట ! పోనియ్యండి," అంటూ సావిత్రి కాగితం సంచీ తీసి, ముడివిప్పటానికి ప్రయత్నించినట్టూ, అది ఒకంతట రానట్టూ అభినయించి, చిరాకుగా సంచి అడుగుభాగం చించింది. గొలుసు కింద పడింది. సావిత్రి దాన్ని సమీపంలో ఉన్న దాసికి ఇచ్చి చినిగిపోయిన సంచినీ, కింద పడిన కాగితం తుంపులనూ ఏరి తన సంచికట్టులో వేసుకుని, కాళింది వద్ద సెలవు పుచ్చుకొని, తన పడవకు వెళ్లిపోయింది. ఆమె ఆ పూటనే తన పడ

వలో రుద్రపురానికి తిరిగి వెళ్ళిపోయింది.

నిజానికి సావిత్రి వచ్చినపని అయిపోయింది. గోలాపుడి ప్రాణాలుగల గొలుసు సావిత్రికి వచ్చేసింది. ఆమె కాళిందికి తిరిగి ఇచ్చిన గొలుసు నకలుగొలుసు. సావిత్రి వద్ద ఉన్న కాగితం సంచి లోపల ఇంకొక చిన్న కాగితం సంచి ఉన్నది. రెండు సంచుల మూతులూ కలిసి ఉండటచేత కాళింది నుంచి తీసిన గొలుసు లోపలి సంచిలో పడింది. దిగువ ఉన్న సంచిలో అదివరకే నకలు గొలుసు ఉన్నది. సంచి అడుగుభాగం చించినప్పుడు ఆ నకలు గొలుసు బయట పడింది. దాన్ని కాళిందికి ఇస్తే ఆమె మోసం గుర్తించవచ్చునన్న భయంతో, సావిత్రి దాన్ని ఒక దాసీకి ఇచ్చింది. సావిత్రి తన గొలుసు ఉంచుకోలేదన్న సంతృప్తితో కాళింది ఆ గొలుసును వెంటనే తీసి ధరించలేదు.

సావిత్రి తన ఇంటికి తిరిగిపోయి, ఎవరితోనూ ఏమీ చెప్పక, తనకూ, గోలాపుడి శరీరానికీ వివాహం చెయ్యమని తండ్రిని కోరింది. మొదట తండ్రి అందుకు ఒప్పుకోలేదు.

''అతను నా భర్త అయితే, నా పాతివ్రత్య మహిమతో అతను బ్రతుకుతాడు,'' అన్నది సావిత్రి.

సావిత్రిని నిర్జీవుడికిచ్చి పెళ్ళిచేశారు. సావిత్రి తన మేనత్తచేత మెడలో మాంగల్యంకట్టించుకుని, తాను తెచ్చినగొలుసు గోలాపుడి మెడలో కట్టింది. వెంటనే గోలాపుడు బతికాడు.

తరువాత కొద్దిరోజులకు అకస్మాత్తుగా గోలాపుడు తన తల్లితోనూ, భార్యతోనూ దేవగిరికి తిరిగివచ్చాడు. కాళింది తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. కాని ఆమె సావిత్రిని గుర్తుపట్టింది. అయితే ఆమె జరిగిన దేమిటో తెలుసుకొనేలోపల కొత్తరాజు గోలాపుడు ఆమెకు ఆ జన్మ కారాగార శిక్ష విధించాడు.





# ఉత్తుత్తి ఔదార్యం

శ్రీనివాసపురంలో కస్తూరి రంగయ్య గొప్ప ధనికుడు. అతని వద్ద అప్పు తీసుకోనివాళ్ళు ఊళ్ళో అరుదు. అతనిలో విశేషం ఏమంటే, పరమ లోభి అయి కూడా ఉదారుడిలాగా నటించేవాడు.

ఆ గ్రామానికి ఒక హరిదాసు వచ్చి, తన చేత కథ చెప్పించే ఏర్పాటు చెయ్యమని కస్తూరి రంగయ్యను ఆశ్రయించాడు. రంగయ్య హరిదాసును నాలుగు రోజులు తన చుట్టూ తిప్పించుకున్నాడు. ఈ లోపల హరిదాసు పక్క ఊళ్ళో సంపాదించుకు వచ్చిన డబ్బు కాస్తా అయిపోయింది. పూట గడవక అతను కస్తూరి రంగయ్య వద్దకు వెళ్ళి, స్వయంపాకం కోసం యాచించాడు.

అదే సమయానికి నాగిశెట్టి కస్తూరి రంగయ్య వద్దకు అప్పుకోసం వచ్చాడు. కస్తూరి రంగయ్య శెట్టికి హరిదాసును చూపి, "వీరు వచ్చి నాలుగు రోజులయింది; కథ ఏర్పాటు చేయించమని అడుగుతున్నారు. నా కేమో వీలుపడకుండా ఉన్నది. ఏమీ అనుకోక, కాస్త సహాయం చేసిపెట్టు," అన్నాడు.

నాగిశెట్టి సరేనన్నట్టు తల ఊపాడు.

"అన్నట్టు హరిదాసుగారి దగ్గిర చిల్లి గవ్వ లేదట. ఈ రోజుకు ఆయన స్వయంపాకం నీ వంతు అనుకో!" అన్నాడు కస్తూరి రంగయ్య, నాగిశెట్టికి అప్పు డబ్బు ఇచ్చి పంపేస్తూ.

శెట్టి హరిదాసును తన వెంట అంగడికి తీసుకుపోయి, స్వయంపాకం ఇప్పించాడు. అతను ఆ రోజు రాత్రి ఊరి దేవాలయం వద్ద హరికథ కూడా ఏర్పాటు చేశాడు. జనం వచ్చారు.

హరిదాసు కథ ప్రారంభించబోతూ, "నేనీ గ్రామానికి రావడానికి మూల

వి. యజ్ఞరామయ్య



కారణం కస్తూరి రంగయ్యగారి కీర్తే! వారి కీర్తిచంద్రికలు దిగంతాలకు వ్యాపించాయి. వారు యాచకుల పాలిటి కల్ప వృక్షమన్న సంగతి వారితో మాట్లాడాక నాకు తెలిసింది. పౌర్ణమి చంద్రుడిలో మచ్చ అయినా ఉన్నదిగాని, వారి ముఖ చంద్రుడిలో మచ్చలేదు. ఉత్తమ సంస్కారి అంటూ చెప్పాలంటే కస్తూరి రంగయ్యగారి పేరు చెప్పిన తరవాతే మరెవరినైనా చెప్పాలి. వారు త్యాగంలో శిబినీ, దిలీపుణ్ణీ మించుతారంటే అతిశయోక్తి కాదు,'' అన్నాడు.

ఈ పొగడ్తలకు కస్తూరి రంగయ్య ఉబ్బిపోయి, గర్వముఖం పెట్టాడు.

కథ ముగిసింది. అందరితోపాటు ఇంటికి చేరుకుంటూ కస్తూరి రంగయ్య, ''నన్ను హరిదాసు అలా పొగడటంలో అంతరార్థం ఏమిటో ?'' అనుకున్నాడు.

మర్నాడు హరిదాసు కస్తూరి రంగయ్య ఇంటికి వెళ్ళి, తన సంభావన అడిగాడు. కస్తూరి రంగయ్య ఒక కాగితంమీద తన పేరు రాసి, పాతిక రూపాయలు చందా వేశాడు. ఆయన దాన్ని హరిదాసు కిస్తూ, ''తతిమ్మా వాళ్ళ దగ్గిర వసూలు చేసుకు రండి. నేను తరవాత ఇస్తాను. ఇప్పుడు గుమాస్తా లేడు,'' అన్నాడు.

హరిదాసు పదిమందిచేతా చందాలు వేయించి, వంద రూపాయలదాకా వసూలు చేసుకున్నాడు. ఆ సాయంకాలం అతను కస్తూరి రంగయ్యను చూడబోతే, ఆయన హరిదాసుతో ఎన్నో సంగతులు మాట్లాడాడుగాని, చందామాట ఎత్తలేదు.

చివరకూ హరిదాసు వెళ్ళివస్తానంటే, సరే వెళ్ళిరమ్మన్నాడు రంగయ్య.

మర్నాడు హరిదాసు రంగయ్య ఇంటికి రెండుసార్లు వెళ్ళాడు. ఒకసారి రంగయ్య ఇంట్లో లేడనీ, రెండోసారి పూజలో ఉన్నాడనీ గుమాస్తా చెప్పాడు.

మూడోనాడు హరిదాసు వెళ్ళేసరికి రంగయ్య ఎవరితోనో మాట్లాడుతున్నాడు. హరిదాసు చాలాసేపు చూసి, ''నేను

రేపు ఊరికి పోతున్నాను. తమ చందా దయచేయించండి,'' అని అడిగాడు.

''అదేమిటి? గుమాస్తా ఇయ్యలేదా? ఇయ్యమని మొన్ననే చెప్పానే? సరే, ఈరోజు గుమాస్తా ఊళ్ళోలేడు, మీరు రేపు రండి,'' అన్నాడు కస్తూరి రంగయ్య.

ఉసూరుమంటూ హరిదాసు వెళ్ళిపోయి, మర్నాడు గుమస్తా తిరిగివచ్చిన సంగతి తెలుసుకుని చూడబోయాడు. గుమస్తా అతన్ని చూసి, ''ఏమిటి ఇలా వచ్చారు?'' అని అడిగాడు.

హరిదాసు జరిగినదంతా చెప్పాడు.

గుమస్తా క్షణం ఆలోచించి, ''హరిదాసు గారూ, మీరు ఏమీ అనుకోకండి. చందా వేసేవరకే రంగయ్యగారు ఉదారుడు. ఆయనను చూసి మిగతావాళ్లు చందాలు వేస్తారే, అవన్నీ తానువేసిన చందాలే అనుకుంటాడాయన! రంగయ్యగారి చందామీద ఆశపెట్టుకోకండి,'' అన్నాడు.

హరిదాసుకు విషయం బోధపడింది. ఆ సాయంకాలం కస్తూరి రంగయ్య పదిమందితో మాట్లాడుతుండగా హరిదాసు వచ్చి, ''అయ్యా, నేను వెళ్ళిపోతున్నాను. శలవిప్పించండి. నాతో మీరు ఒక్క అబద్ధమే చెప్పారు: మీ చందా సొమ్ము నా కియ్యమని మీ గుమస్తాతో చెప్పానన్నారే అది ఒక్కటే మీరు ఆడిన అబద్ధం. నేను మీ గురించి ప్రశంసిస్తూ అబద్ధాలు చాలా ఆడాను. బీదవాణ్ణి కావటంచేత కక్కుర్తిపడి అసత్యాలాడక తప్పలేదు. అందుకే తమకు నాపై అనుగ్రహం కలగలేదనుకుంటున్నాను,'' అన్నాడు.

పదిమంది మధ్య కస్తూరి రంగయ్యకు తల తీసేసినట్టయింది. వాళ్ళందరూ హరిదాసుకు చందాలిచ్చిన వాళ్ళే. అతను వెళ్ళిపోతున్న హరిదాసును వెనక్కు పిలిచి గుమస్తా మీద ఎగిరిపడి, పాతిక రూపాయలూ ఇప్పించాడు. ఇంత కాలానికి కస్తూరి రంగయ్యకు చెప్పుతో కొట్టినట్టు చెయ్యగలవాడు దొరికాడుగదా అని ఊళ్ళోవాళ్ళు సంతోషించారు.





# చెడ్డవాడి గొప్పతనం

గోపాలయ్య కొడుకు గోవిందయ్యకు ఇరవై ఏళ్లు మీదపడినా బుద్ధి కొంచెం కూడా రాలేదు. వాడు ఒక్క మంచిపనీ చేసేవాడు కాదు. వాణ్ణి ఎలా మార్చాలో తెలియక గోపాలయ్య సతమత మవుతున్న సమయంలో ఆ గ్రామానికి చిరంజీవి వచ్చాడు. ఆయన ఎలాంటివాడికైనా వివేకం కలిగించగలడని విని, గోపాలయ్య ఆయనను తన ఇంటికి ఆహ్వానించి, తన కొడుకు సంగతి చెప్పుకుని బాధపడ్డాడు.

చిరంజీవి గోవిందయ్యను పిలిపించి, వాడివంక కొద్ది క్షణాలు తీక్షణంగాచూసి, ''అనవసరంగా ఎందుకు బాధపడతావు గోపాలయ్యా? నీ కొడుకు చెడ్డ పనులు చేస్తేనేం? మంచికంటే చెడు చెయ్యటమే ఎంతో కష్టం. కష్టమైన పని చేసేవాడు ఎప్పటికైనా బాగుపడతాడు,'' అన్నాడు.

గోవిందయ్య తండ్రి వంక నిరసనగా చూసి, అదోలా నవ్వి, అక్కడినుంచి వెళ్లిపోయాడు.

గోపాలయ్య నిరాశచెంది, ''మీరేదో మా వాణ్ణి దారిలో పెడతారనుకుంటే ఇలా చేశారేమిటి? వాడింకేం బాగుపడతాడు?'' అన్నాడు.

''అయితే నువు నా మాటల్నే శంకిస్తున్నావన్నమాట!'' అన్నాడు చిరంజీవి కోపంగా.

''లేకపోతే తమబోటి పెద్దలనవలసిన మాటలేనా అవి? మంచి అనిపించుకోవడం కష్టంకాని, చెడు అనిపించుకోవడానికి క్షణం పట్టదు,'' అన్నాడు గోపాలయ్య.

''ఊరికే అనగానే సరికాదు. నాకూ, నీ అబ్బాయికీ కూడా ఈ మాట రుజువు చేసి నిరూపించాలి,'' అన్నాడు చిరంజీవి.

"వసుంధర"

గోపాలయ్య తన కొడుకును మళ్ళీ పిలిపించాడు. చిరంజీవి తన పక్షమని తెలియగానే, ఈ దెబ్బతో తండ్రిచేత మాటలు పడేబాధ శాశ్వతంగా వదిలించు కోవచ్చునని, గోవిందయ్య తండ్రి చెప్పి నట్టు చెయ్యడానికి ఒప్పుకున్నాడు.

ముగ్గురూ కలిసి ఊళ్ళోని మోతుబరి రామయ్య ఇంటికి వెళ్ళారు. రామయ్య తన అనుభవాన్ని వారికి చెప్పాడు. అయన తన పనివాళ్ళనందరినీ ఎంతో ఆదరంతో చూస్తాడని పేరు తెచ్చుకున్నాడు. అటువంటివాడు ఒకరోజున ఎందుకో ఒళ్ళుతెలియని కోపంవచ్చి, తన పాలేరును చావగొట్టాడు. ఇలా ఆ ఒక్క సారే జరిగింది. అయినా పనివాళ్ళలో ఆయనకు చెడ్డపేరు వచ్చింది. ఆ తర వాత ఆయన తమతో ఎంత మంచిగా ఉన్నా, పనివాళ్ళకు ఆయనపట్ల కలిగిన అభిప్రాయం పోలేదు.

''ఎన్ని మంచిపనులు చేసినా ఒక్క చెడ్డపనితో అవన్నీ తుడిచిపెట్టుకు పోతాయి,'' అన్నాడు రామయ్య.

గోపాలయ్య తన కొడుకునూ, చిరంజీవినీ వెంటబెట్టుకుని, ఇలాటి వాళ్లు ముగ్గురి వద్దకు వెళ్ళాడు. అందరూ రామయ్య చెప్పినట్టే, మంచిపేరు తెచ్చు కోవటం కష్టమనీ, చెడ్డపేరు తెచ్చు



కోవటం తేలిక అనీ చెప్పారు.

''ఇప్పు డేమంటారు?'' అన్నాడు గోపాలయ్య.

''ఆగు! నా మాటలో నిజంకూడా రుజువు చేస్తాను. ఈ ఊళ్లో జులాయి వెధవగా పేరుబడ్డ వాడి ఒకడి పేరు చెప్పు,'' అన్నాడు చిరంజీవి.

''ఎవడో ఎందుకు? మావాడేఉన్నాడు. అయితే వాడు మన వెంటే అఘోరిం చాడు గనక ఇంకోడి పేరు చెబుతాను. వాడి పేరు చంద్రయ్య,'' అన్నాడు గోపా లయ్య.

ముగ్గురూకలిసి తాము ముందుచూసిన రామయ్య వగైరాల వద్దకు వెళ్లి,

చంద్రయ్య గురించి వాళ్ళ అభిప్రాయం అడిగారు.

"వాడు వొట్టివెధవండీ! వాడిమొహం చూస్తేనే పంచమహా పాతకాలూ చుట్టుకుంటాయి," అన్నారు రామయ్యా, ఇతరులూ ఏకగ్రీవంగా.

అప్పుడు ముగ్గురూ కలిసి చంద్రయ్య దగ్గిరికి వెళ్ళారు. చిరంజీవి వాడితో. "ఊరంతా దుర్మార్గుడంటున్నారు నిన్ను. ఆ విషయం నీకు తెలుసా?" అన్నాడు.

"తెలుసు. ఏ వెధవ ఏ మనుకుంటే మాత్రం నాకు లెక్కేమిటి?" అన్నాడు చంద్రయ్య.

ముగ్గురూ అక్కడినుంచి తిరిగి వచ్చేటప్పుడు దారిలో ఒక బిచ్చగాడు తగిలాడు. చిరంజీవి వాణ్ణి దగ్గిరికి పిలిచి, "దున్నపోతులా ఉన్నావు, పని చేసుకుని బ్రతకలేవూ, ఇలా అడుక్కు తినకపోతే?" అని అడిగాడు.

"ఇష్టమైతే బిచ్చం వెయ్యండి, లేకపోతే మానెయ్యండి. అంతేగాని మాటలు మిగలకండి! నేను నామానాన అడుక్కు తింటున్నానేగాని చెడ్డపనులు చెయ్యడం లేదు," అన్నాడు బిచ్చగాడు.

వాడు వెళ్ళిపోయాక చిరంజీవి నవ్వి, "చూశారుగా? బిచ్చగాడు కూడా మాట పడడంలేదు. ఊరంతా తనను దుమ్మెత్తి పోసినా, చెడ్డపనులు చేసేవాడు వాటిని సహించి చెడ్డపనులు చేసుకుపోగలుగుతున్నాడు. అలాటి ఓర్పు చెడ్డవాళ్ళకు తప్ప సాధ్యపడదు. అందుకే చెడ్డగా ఉండడం కష్టమన్నాను. మానవజన్మ ఎత్తి మానాభిమానాలు వదిలిపెట్టటంకన్న కష్టమైన పని ఏమున్నది ఈ లోకంలో?" అన్నాడు.

చిరంజీవి అన్న మాటలలోని వ్యంగ్యం గోపాలయ్యకు అర్థమయింది గోవిందయ్యకుకూడా ఆ మాటలు సిగ్గు తెప్పించాయి. అతను క్రమంగా తన చెడ్డ బుద్ధులు వదిలిపెట్టేశాడు.






శుకుడు జనకుడు చెప్పినది విని, ''నువు చెప్పినది సంతోషంతో విన్నాను గాని నా సందేహం తీరలేదు. పెళ్ళాడిన తరవాత పెళ్లాంతో సుఖపడితే అందులో చిక్కుకుపోతాడు. సుఖం లభించకపోతే ఖిన్నుడౌతాడు. అలాటివాడు మోక్షం ఎలా పొందుతాడు?" అని అడిగాడు.

''నిర్లిప్తంగా చేసే కర్మలు చెడ్డవే అయినా మంచివి అవుతాయి,'' అన్నాడు జనకుడు.

''మాయలో చిక్కుకున్న వాడు నిర్లిప్తుడు ఎలా అవుతాడు? దీపం పేరు చెప్పిన మాత్రాన చీకటి పోదుగదా! అలాగే శాస్త్రజ్ఞానం సంపాదించిన మాత్రాన మనిషిలోవున్న అజ్ఞానం తొలగుతుందా? ఆచరణానుభవం ఉండవద్దా? నీలో ధన వాంఛా, పుత్రవాంఛా, స్త్రీ వాంఛా, రాజ్య వాంఛా ఉన్నాయి. నువు జీవన్ముక్తుడివి ఎలా అవుతావు? రాజుగా నువు దుష్ట శిక్షణా, శిష్ట రక్షణా చేయక తప్పదు గద! ఈ భేదాలు పాటించే నీకు మోక్షం వస్తుందని ఎలా నమ్మటం? నేనంటే, నాకు ఏమీ లేదు. సుఖం లేదు, దుఃఖం లేదు, శత్రువు లేదు, మిత్రుడు లేదు, మానం లేదు, అవమానం లేదు, ఏల టానికి ఒక చిన్న పల్లె కూడా లేదు. నా వంటి వాడికే గదా జీవన్ముక్తి?'' అని శుకుడు అడిగాడు.

''సన్యసించి, అరణ్యంలోకి పోయి నంతమాత్రాన విచారాలు తప్పుతాయనుకో



వద్దు. మమకారం వదిలి ఏ మార్గం అవలంబించినా మోక్షం పొందవచ్చు. మమకారం వదలకపోతే ఏ మార్గం అవలంబించి కూడా ముక్తి రాదు,'' అన్నాడు జనకుడు.

శుకుడు తృప్తిపడి, తండ్రి వద్దకు తిరిగి వెళ్ళాడు.

''నాయనా, జనకుడు నీ సందేహం తీర్చాడా ?'' అని వ్యాసుడు శుకుణ్ణి అడిగాడు.

''ఆ జనకుడిలాగా ఉండటానికి నాకు అభ్యంతరం లేదు,'' అన్నాడు శుకుడు.

ఈ మాట విని వ్యాసుడు సంతోషించి, పీవరి అనే కన్యను తెచ్చి శుకుడికి పెళ్లి చేశాడు. శుకుడు నిర్లిప్తత విడవకుండా ఆమెతో కాపరం చేస్తూ, గౌరప్రభుడూ, దేవశ్రుతుడూ, భూరీ, కృష్ణుడూ అనే నలుగురు కొడుకులనూ, వారి తరవాత కీర్తి అనే కుమార్తెనూ కన్నాడు. కీర్తి అణుహుడు అనేవాణ్ణి, విభ్రాజుడి కొడుకును, పెళ్లాడి బ్రహ్మదత్తుణ్ణి కన్నది.

బ్రహ్మదత్తుడు రాజై, పరిపాలన చేస్తూండగా, ఒకసారి నారదుడు కనిపించి మాయా బీజోపదేశం చేశాడు. దానితో బ్రహ్మదత్తుడికి జ్ఞానోదయమూ, వైరాగ్యమూ కలిగి, రాజ్య భారాన్ని తన కొడుకు మీద పెట్టి, బదరికాశ్రమానికి వెళ్ళిపోయాడు.

శుకుడు కూడా తండ్రిని వదిలిపెట్టి కైలాస శిఖరానికి వెళ్లి, అక్కడ కొంత కాలం ధ్యానంలో గడిపి, తరవాత ఆ కొండ శిఖరం మీదినుంచి దూకి, సిద్ధి పొందాడు.

కొడుకు పోయినందుకు వ్యాసుడు చాలా బాధపడి, అక్కడ ఉండలేక, ''అయ్యో, పుత్రా!'' అని కేకలు పెట్టుతూ కైలాసానికి వెళ్ళాడు. అంతటా నిండి ఉన్న శుకుడు ప్రతిధ్వని రూపంలో తండ్రికి జవాబిచ్చాడు.

అలా శోకిస్తున్న వ్యాసుడి వద్దకు శివుడు వచ్చి, ''నీ కొడుకు యోగులకు కూడా



లభ్యంగాని మోక్షం పొందాడు. అతని కోసం శోకించటం భావ్యమా?'' అన్నాడు.

''కొడుకును చూడక నా కళ్ళు చల్లగా ఉండవు. మనస్సు చిన్నబోయింది. నేనేం చేసేది?'' అన్నాడు వ్యాసుడు.

వ్యాసుడి విచారం తీరేది కాదని గ్రహించి శివుడు, ''నీ కొడుకు ఎల్లప్పుడూ నీడలాగా నీ వెంటే ఉంటాడు,'' అని వరమిచ్చి వెళ్ళిపోయాడు.

తరవాత వ్యాసుడు తన ఆశ్రమానికి తిరిగివచ్చాడు.

శౌనకాది మునులు శుకుడి కథ విని, ''తరవాత వ్యాసుడు ఏం చేశాడు?'' అని సూతుణ్ణి అడిగారు.

సూతుడు ఇలా చెప్పాడు:

### ధృతరాష్ట్రాదుల జననం

వ్యాసుడి శిష్యులైన దేవలుడూ, వైశంపాయనుడూ, జైమినీ, అసితుడూ, సుమంతుడూ అంతకు పూర్వమే గురువుగారి వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు. ఇప్పుడు శుకుడు కూడా పోయాడు. వ్యాసుడు కూడా ఎక్కడైనా వెళ్ళిపోదామనుకుని, తన తల్లి అయిన సత్యవతి జ్ఞాపకం రాగా, ఆశ్రమం విడిచిపెట్టి, తాను పుట్టిన చోటికి వెళ్ళి, అక్కడి నిషాదులను కలుసుకుని, తన తల్లి గురించి అడిగాడు. వాళ్ళు వ్యాసుడికి శంతనుడు సత్యవతిని పెళ్ళాడి తీసుకుపోయిన సంగతి చెప్పారు.

వ్యాసుడు ఆ సమీపంలోనే సరస్వతీ నదీ తీరాన ఆశ్రమం ఏర్పరచుకుని తపస్సు చేసుకుంటూ ఉండిపోయాడు.

ఇలా ఉండగా, శంతనుడు సత్యవతి వల్ల చిత్రాంగద విచిత్రవీర్యులనే కొడుకులను కని, కొంతకాలానికి చనిపోయాడు. శంతనుడి పెద్ద కొడుకైన భీష్ముడు తండ్రికి ఉత్తర క్రియలు జరిపి తండ్రిస్థానంలో తాను రాజ్యం చెయ్యటం ఇష్టంలేక, చిత్రాంగదుడికి పట్టంకట్టాడు.

చిత్రాంగదుడు ఒకసారి వేటకు అరణ్యానికి వెళ్లితే, అక్కడ అతనికి తన పేరే



గల గంధర్వుడితో పోరాటం జరిగింది. ఆ యుద్ధంలో గంధర్వుడైన చిత్రాంగదుడు, భీష్ముడి తమ్ముడైన చిత్రాంగదుణ్ణి చంపేశాడు.

తరవాత భీష్ముడు తమ్ముడికి ఉత్తరక్రియలు చేసి, విచిత్రవీర్యుడికి పట్టం కట్టాడు. దీనికి వ్యాసుడు కూడా సమ్మతించాడు. విచిత్రవీర్యుడు యుక్తవయస్కుడయాడు. భీష్ముడు అతనికి పెళ్ళి చేసే ఆలోచనలో ఉన్నాడు.

ఆ సమయంలో కాశీరాజు తన కుమార్తెలకు స్వయంవరం ఏర్పాటు చేసి, రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు. భీష్ముడు ఆ స్వయంవరానికి వెళ్ళి, మిగిలిన రాజులందరినీ ఓడించి, కాశీరాజు కూతుళ్ళు అంబా, అంబికా, అంబాలికా అనే వాళ్లను తన రథం మీద ఎక్కించుకుని, ఇంటికి వచ్చి, వారిని తన తల్లికి చూపి, వారిని విచిత్రవీర్యుడికి పెళ్ళి చెయ్యటానికి ముహూర్తం కూడా నిర్ణయించాడు.

అప్పుడు అంబ అనే పిల్ల, సిగ్గుతో తలవంచుకుని, భీష్ముడితో, "నేనూ, సాల్వుడూ పరస్పరం ప్రేమించుకున్నాం. నువేమో బలంకొద్దీ నన్ను తెచ్చావు. నీ అధీనంలోకి వచ్చిన నన్ను ఆ రాజు ఏలుకుంటాడా?" అన్నది.

భీష్ముడు పెద్దలతోనూ, తల్లితోనూ, మంత్రులతోనూ సంప్రతించి, అంబను స్వేచ్ఛగా పంపేశాడు. ఆమె సాల్వుడి వద్దకు వెళ్ళి, "నేను నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పేసరికి, భీష్ముడు నన్ను పంపేశాడు. నన్ను నువు న్యాయంగా పెళ్ళిచేసుకో," అన్నది.

"నేను చూస్తూండగా భీష్ముడు నిన్ను తాకాడు. మరెవడో తీసుకుపోయి, వదిలేసిన దాన్ని ఎవడైనా పెళ్ళాడుతాడా? ఎలా వచ్చావే అలాగే తిరిగిపో," అన్నాడు సాల్వుడు.

"అయ్యో, ఎందుకూ కాకుండా పోయాను!" అని విలపిస్తూ, అంబ భీష్ముడి వద్దకు తిరిగివచ్చి, "సాల్వుడు

నన్ను నిరాకరించాడు. నేను ఎటూ కాకుండా చెడ్డాను. నన్ను పెళ్ళాడు," అని వేడుకున్నది.

"మరొకరిని ప్రేమించినదాన్ని పెళ్లాడ రాదు. నీ తండ్రి వద్దకు వెళ్లు," అన్నాడు భీష్ముడు.

అంబ తండ్రి వద్దకు పోక, అరణ్యంలో తపస్సు చేసుకోబోయింది. భీష్ముడు మిగిలిన ఇద్దరు కన్యలనూ విచిత్ర వీర్యుడి కిచ్చి పెళ్లి చేశాడు. విచిత్ర వీర్యుడు ఆ భార్యలతో క్రీడిస్తూ, తొమ్మి దేళ్లు రాజ్యం చేసి, క్షయవ్యాధితో చని పోయాడు. తన రెండో కొడుకు కూడా పోయి నందుకు సత్యవతి దుఃఖించి, భీష్మణ్ణి పిలిచి, ఒంటరిగా అతనితో, "నువు కూడా శంతనుడి కొడుకువే గనక, రాజ్యం చేపట్టి, నాకు పిల్లలు లేని కొరత తీర్చు. పిల్లలు లేకపోతే వంశం నశిస్తుంది. అంబికా, అంబాలికలయందు కొడుకు లను కను. అది ధర్మమేగద!" అన్నది.

"రాజ్యం చెయ్యననీ, పెళ్ళాడననీ శపథం చేశాను గద. సత్కులానికి చెందిన బ్రాహ్మణుడి ద్వారా పిల్లలను కని వంశం నిలపటం కూడా ధర్మమే." అన్నాడు భీష్ముడు.

భీష్ముడు ఇలా అనగానే సత్యవతి వ్యాసుణ్ణి తలచుకున్నది. వెంటనే



వ్యాసుడు వచ్చాడు. భీష్ముడు ఆయనకు తగిన మర్యాదలు చేశాడు.

సత్యవతి వ్యాసుడితో, "నీ తమ్ముడి భార్యయందు కొడుకును కని, వంశం నిలబెట్టు." అన్నది.

వ్యాసుడు తల్లి ఆజ్ఞ ప్రకారం అంబికకు ఒక కొడుకును కన్నాడు. కాని ఆ పిల్ల వాడు గుడ్డివాడు కావటంచేత రాజ్యార్హత గలవాడు కాడు. అది చూసి సత్యవతి తన రెండవ కోడలైన అంబాలిక చేత వ్యాసుడికి ఒక కొడుకును కనిపించింది. ఆ బిడ్డ పాండురోగి, రాజ్యార్హుడు కాడు. అప్పుడు సత్యవతి అంబికను మరొకసారి కొడుకును కనమన్నది. అంబిక తన



అత్తకు ఎదురు చెప్పలేక సరేనని, రహస్యంగా తన దాసిని వ్యాసుడి వద్దకు పంపింది. ఆ దాసికి వ్యాసుడి వల్ల విదురుడు పుట్టాడు. అతను మళ్ళీ వ్యాసుడంతటివాడు.

ఈ విధంగా భరతవంశాన్ని నిలబెట్టటానికి వ్యాసుడి వల్ల ధృతరాష్ట్రుడూ, పాండురాజూ, విదురుడూ పుట్టారు.

మునులు సూతుడికి అడ్డు వచ్చి, "మహానుభావా, సత్యవతికీ, శంతనుడికీ వివాహం ఎలా అయింది? అసలు అంతకు ముందే ఆమెకు వ్యాసుడు ఎలా జన్మించాడు. ఈ విషయాలు వివరంగా చెప్పు." అన్నారు.

మునులు అడిగిన దానికి సూతుడు ఇలా చెప్పాడు:

ఉపరిచరవసువు చేదిదేశాన్ని పాలించేవాడు. అతను గొప్ప తేజో బల పరాక్రమాలు గలవాడు; ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేసి మెప్పించి, ఇంద్రుడి నుంచి దివ్యవిమానం పుచ్చుకున్నాడు. అతను అస్తమానమూ ఆ విమానం మీద ఆకాశంలో తిరుగుతూండటం చేతనే "ఉపరిచరుడు" అనే పేరు వచ్చింది.

ఉపరిచరవసువు భార్య గిరిక చాలా చక్కనిది. ఆమె పరిచర్యలు చేస్తూంటే అతను దేవేంద్ర భోగాలు అనుభవిస్తూ, బల సంపన్నులైన తన అయిదుగురు కొడుకులనూ అయిదు దేశాలకు రాజులను చేశాడు.

ఒకసారి గిరిక ఋతుస్నానం చేసి, భర్త సాంగత్యం కొరకు ఎదురు చూస్తూ వున్న సమయంలో, వసువును అతని తండ్రి పిలిచి, "నాయనా, నీ తాతగారికి తద్దినం పెట్టాలి. నువు వెంటనే వెళ్ళి ఏదన్నా జంతువును వేటాడి తీసుకురా," అన్నాడు.

భార్య కోరిక తీర్చాలో, తండ్రి ఆజ్ఞ పాలించాలో తేల్చుకోలేక కొంతసేపు మథనపడి, తండ్రిమాట ప్రకారమే అతను వేటకు వెళ్ళాడు.

అయితే అతని మనసు భార్య మీదనే ఉన్న ఫలితంగా, బ్రాహ్మణ శాపంవల్ల యమునలో చేపగా జీవిస్తున్న అద్రిక అనే అప్సర గర్భం ధరించింది.

మునులు మళ్ళీ సూతుడికి అడ్డువచ్చి, అద్రికకు శాపం ఎందుకు వచ్చిందని అడిగారు. దానికి సూతుడు ఇలా చెప్పాడు:

మత్స్యగంధి జననం

ఒకసారి ఒక బ్రాహ్మణుడు యమునలో దిగి సంధ్యావందనం చేసుకుంటూ వుండగా, అద్రిక అనే అప్సర యమునలో స్నానం చేయవచ్చి, నీటిలో మునిగి ఆ బ్రాహ్మణ్ణి సమీపించి, హాస్యం కోసం అతని కాళ్ళు పట్టిలాగింది.

బ్రాహ్మణుడు మండిపోయి, చేపవై నీటిలోపడి ఉండమని ఆమెను శపించాడు. ఆమె అతని కాళ్ళు పట్టుకుని వలవలా ఏడ్చింది. బ్రాహ్మణుడు జాలిపడి, "కొంత కాలానికి నీ కడుపున ఒక కొడుకూ, కూతురూ పుట్టుతారు. అప్పుడు నీకు నీ అసలురూపం వచ్చేస్తుంది." అని శాపవిమోచనం చెప్పి వెళ్ళిపోయాడు. అది మొదలు ఆమె యమునానదిలో చేపగా జీవిస్తున్నది.

వసువు కారణంగా ఆ చేప గర్భం ధరించి, కొంత కాలానికి బెస్తవాడి వలలో పడింది. వాడు చేపను కోసేసరికి దాని కడుపులో ఒక పిల్లా, పిల్లవాడూ కనిపించారు. వాడు ఆ పిల్లలను తీసుకుపోయి వసువుకు చూపాడు. వసువు ఆశ్చర్యపడి, చేపకడుపులో పుట్టిన బాలుణ్ణి తాను తీసుకుని, పిల్లను బెస్తవాడికే ఇచ్చేశాడు. ఆమె కాలికా, మత్స్యోదరీ, మత్స్యగంధీ అనే మూడు పేర్లతో పిలవబడుతూ బెస్తవాడి వద్ద పెరిగింది.

కుర్రవాడు మత్స్యుడు అనే పేరుతో ఉపరిచరవసువు ఇంట పెరుగుతూ వచ్చాడు.

చేపరూపంపోగానే అద్రిక శాపవిముక్తి పొంది, అప్సరగామారి తన లోకానికి వెళ్ళిపోయింది.



# నెరవేరని ప్రతిజ్ఞ

చతురావర్తంలో ఒక ధనికుడికొడుకు సుదర్శను డనేవాడు తండ్రి పోగానే అన్నిరకాల వ్యస నాలూ మరిగి, ఉన్నదంతా తగలేసుకుని, ఆస్తితోబాటు స్నేహితులుగా నటించిన వారిని దూరం చేసుకుని, భార్యతోనహా మరొక ఊరికి బయలుదేరాడు. అది చూసి అతని పాత మిత్రులు నవ్వారు.

"నేను మళ్ళీ సంపన్నుడుగా తిరిగివచ్చి, మీ అందరినీ నా చుట్టూ కుక్కల్లాగా తిప్పించు కోకపోతే నేను చచ్చినవాడి కింద జమే," అని అతను ప్రతిజ్ఞచేశాడు.

మరొక ఊళ్లో అతను వ్యాపారం చేసి, పోగొట్టుకున్న దానికన్న ఎక్కువే సంపాదించి, తన ప్రతిజ్ఞ నిలబెట్టుకునేటందుకు చతురావర్తానికి బయలుదేరాడు.

దారిలో భార్యాభర్తలు ఒక రాత్రి సత్రంలో బసచేశారు. ఆ రాత్రి సత్రం అరుగుమీద కొందరు జూదం ఆడుతున్నారు. సుదర్శనుడు ఆ ఆటలోచేరి తెల్లవారేలోపల దగ్గిర ఉన్నదంతా పోగొట్టుకున్నాడు.

అతను తెల్లవారి తిరిగి వెళ్ళేప్రయత్నంలో ఉండటం చూసి భార్య, "మీ ప్రతిజ్ఞ మాటేమిటి?" అన్నది.

"ప్రతిజ్ఞ నెరవేర్చకపోతే నేను చచ్చినట్టే నన్నానుగదా? అలాగే కానీ! తాగుబోతూ, జూదరీ అయిన సుదర్శనుడు ఏనాడోపోయాడు," అన్నాడతను.

—కలువకొలను సదానంద.





# ఉల్లికాడలు

ఊర్మిళ అమాయకురాలూ, నెమ్మదస్తురాలూనూ. ఆమెను చిన్న ఉద్యోగం చేసుకునే చిరంజీవి కిచ్చి పెళ్ళి చేశారు. చిరంజీవికి చిన్నప్పటినుంచీ కోపమూ, అసహనమూ జాస్తి.

కాపరానికి వస్తూనే ఊర్మిళ తన భర్తను చూసి దడుచుకోసాగింది. భర్త చెప్పేది, భయం మూలంగా, ఆమె తలకెక్కేది కాదు; ఆ కారణంవల్ల చెప్పిన పని అవకతవకగా చేసి, మొగుడి చేత తన్నులు తినేది.

ఒకరోజు సాయంత్రం చిరంజీవి ఉల్లి కాడలు తెచ్చి భార్యకిచ్చి, "కింద ఉన్న ఉల్లిగడ్డలు కూరచేసి, పై ఆకుతో పులుసు చెయ్యి. నేను అలా రామాలయందాకా వెళ్ళివస్తాను," అని చెప్పి వెళ్ళి పోయాడు.

భర్త మాట్లాడటం మొదలుపెట్టగానే కంగారుతో మతిపోయే ఊర్మిళ కూరా, పులుసూ అన్న మాటలు తప్ప ఇంకేమీ సరిగా వినలేదు. ఆమె ఉల్లిగడ్డలూ, ఆకులూ విడివిడిగా తరిగి, గడ్డలతో పులుసూ, ఆకులతో కూరా చేసి, గిన్నెల మీద మూతలు పెట్టి, భర్త రాకకోసం చూడసాగింది.

బాగా చీకటిపడి పొద్దుపోయిం తరవాత చిరంజీవి ఇంటికి వచ్చి, వస్తూనే, "నేను చెప్పినట్టు వంట చేశావా?" అని భార్యను అడిగాడు.

"ఆ, చేశాను. ఉల్లిగడ్డల పులుసూ, ఉల్లి ఆకుల కూరా చేశాను," అన్నది ఊర్మిళ.

ఆ మాట విని చిరంజీవి మండిపడి, వీధి తలుపు వేసివచ్చి, "నువ్వెప్పుడూ ఇంతే! నాలుగు తన్నితేగాని చెప్పినది చెయ్యవు," అంటూ ఊర్మిళ వీపు మీద నాలుగు గుద్దులు వేశాడు.

మాచిరాజు కామేశ్వరరావు

ఊర్మిళ గోడకానుకుని, ఏడుస్తూ కూర్చున్నది.

ఇంతలో అటక మీదీనుంచి ఎవరో దభీమని కిందికి దూకారు. అది ఒక దొంగవాడు. చీకటి పడకముందే వాడు ఇంట్లో ప్రవేశించి, సమయం కోసం అటక ఎక్కి కూర్చున్నాడు. వాడి నల్లటి శరీరమూ, కోర మీసాలూ, చేతిలో పదునైన కత్తీ చూడగానే చిరంజీవి పైప్రాణాలు పైనే పోయాయి. ఏమిచేయటమా అని, అతడు దిక్కులు చూడసాగాడు.

దొంగ కత్తిని చిరంజీవి పీకకు ఆనించి, "అలా మొద్దులా నిలబడ్డావేం? ఇంట్లో ఉన్న నగా, నట్రా మూట కట్టుకురా," అన్నాడు కర్కశంగా.

చిరంజీవి గజగజలాడిపోతూ, "కాస్త కత్తి కిందికి దించండి, కదలలేకుండా ఉన్నాను," అన్నాడు.

తరవాత అతను, దొంగ తనను వెన్నంటిరాగా, పెట్టెలో ఉన్న నగలూ, డబ్బూ బయటికి తీసి, మూటగట్టి, దొంగ చేతికి ఇచ్చాడు.

దొంగ ఆ నగల మూట చంకలో పెట్టుకుని, "ఏదీ ఉల్లిగడ్డల పులుసూ, ఉల్లి ఆకుల కూరా? నీ భార్యను త్వరగా వడ్డించమను!" అన్నాడు చిరంజీవితో.

చిరంజీవి ఊర్మిళతో అసహనంగా, "అలా గుడ్లు మిటకరించి చూస్తూ కూర్చున్నావెందుకు? చప్పున దొంగగారికి



వర్ధన చెయ్యి!'' అంటూ భార్యమీద విరుచుకుపడ్డాడు.

ఊర్మిళ దొంగకు కంచం పెట్టి, కూరా, పులుసూ వడ్డించి భోజనం పెట్టింది. చిరంజీవి దొంగ తింటూన్నంతసేపూ విసురుతూ కూర్చున్నాడు.

''అమోఘమైన కూర! అమృతం లాటి పులుసు!'' అంటూ దొంగ గిన్నెలు ఖాళీచేసి, చిరంజీవితో, ''అసలు నువు మనిషివేనా? ఇంత చక్కగా వంట చేసిన మనిషిని చావబాదుతావా? ఇల్లంతా దోచిన నాకు పెళ్లాంచేత వడ్డింపజేసి, విసురుతూ కూర్చున్నావు!" అంటూ విరగబడి నవ్వాడు.

చిరంజీవికి తల తీసేసి నట్టయింది.

''అసలు నేను ఎలా దొంగనయానో తెలుసా?'' అన్నాడు దొంగ.

తెలియదన్నట్టు చిరంజీవి తల ఆడించాడు.

''మా నాన్న తాగుబోతు. ఎప్పుడూ మా అమ్మను చావగొట్టేవాడు. మా అమ్మ కూలిపని చేసి, డబ్బులు దాచి నన్ను చదివించేది. మా నాన్న మా అమ్మను కొట్టి ఆ డబ్బులు కూడా తాగడానికి తీసుకుపోయేవాడు. మా అమ్మ ఆ దెబ్బల తోనే తొందరలో చచ్చిపోయింది. నేను ఇంక ఆ ఇంట ఉండలేక పారిపోయాను. చదువు లేదు. కష్టపడి కూలిచేసి సంపాదించుకునే ఈడు కూడా కాదు. విధిలేక దొంగగా మారాను. మొగుడూ పెళ్లాలు అన్యోన్యంగా ఉండి చక్కగా సంసారం చేసుకుంటే ఆ ఇంటి పిల్లలకు నా గతి పట్టదు. ఉల్లి ఆకులకూ, గడ్డలకూ ఒకే వాసనా, రుచీ ఉన్నట్టే భార్యాభర్తలకు కూడా ఒకేరకం భావాలు ఉండాలి. ఇకనైనా నువు బుద్ధితెచ్చుకుని, భార్యతో అన్యోన్యంగా ఉండు,'' అని దొంగ లేచి, తన చంకన ఉన్న నగలమూట ఊర్మిళకు ఇచ్చేసి, వెళ్ళిపోయాడు.

అటుతరవాత చిరంజీవి భార్యమీద చెయ్యి చేసుకోలేదు, ఊర్మిళ అతన్ని చూసి దడుచుకోనూలేదు.



# గిడ్డంగుల రహస్యం

ఒకరోజు శ్రీకృష్ణదేవరాయలతో మహామంత్రి తిమ్మరసు, ఆయుధాల గిడ్డంగుల స్థలాలు మార్చుతున్నానని చెప్పాడు. అంత అవసరం ఏం వచ్చిందని శ్రీకృష్ణదేవరాయలు అడిగాడు. దానికి తిమ్మరసు ఇలా చెప్పాడు:

"మన సైన్యంలో రహస్య గిడ్డంగుల ప్రధానాధికారి దగ్గిరపని చేసే ముఖ్యోద్యోగి మరణించాడు. అతడి కొడుకులిద్దరూ ధనం మంచినీరు లాగా ఖర్చుచేస్తున్నట్టు తెలిసింది. చచ్చిపోయినవాడు తన సక్రమ సంపాదనలో అంత డబ్బు మిగిల్చి ఉండటం సాధ్యం కాదు. మన గిడ్డంగుల రహస్యాలు బహమనీసుల్తానులకు విక్రయించి ఉంటాడు."

"అది కేవలమూ మీ అనుమానమే గదా?" అని శ్రీకృష్ణదేవరాయలు అడిగాడు.

"అనుమానం కాదు, నిజం! ఈ మధ్య బహమనీసుల్తానులకు ఆ గిడ్డంగుల రహస్యాలు అమ్మటానికి ఆసక్తి చూపి చూశాను. వారు ఆ రహస్యాలు సంపాదించటానికి ఆసక్తి చూపలేదు. వారికి ఆ రహస్యాలు తెలుసునన్నమాట. మరణించిన ఉద్యోగి దేశద్రోహి," అన్నాడు తిమ్మరసు.

వెంటనే గిడ్డంగులను ఇతర స్థలాలకు మార్చటానికి శ్రీకృష్ణదేవరాయలు అనుమతించాడు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.







M. Natarajan

M. Natarajan

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బొమ్మల రామాయణం

రెండవ ఫోటో : లోకాభిరామాయణం

పంపినవారు : ఎస్. ఎస్. వి. రమణమ్మ, గవర్నర్‌పేట, విజయవాడ–2

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# చందమామ కేమెల్

రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు




**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
చందమామ—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

**CONTEST NO 7**

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 31-3-1979

VISION

కిడ్డీ బ్యాంక్

# 5 సంవత్సరాలు నిండిన బేబీ గీత తన పుట్టినరోజు కానుకగా తాను చూచిన



ఒక చక్కటి బొమ్మను ఇమ్మని నాన్నను కోరింది.



అంతకు ముందు కిడ్డీ బ్యాంక్ బొమ్మను గీత చూసింది బ్యాంక్‌లో కాదు. ఆమె నేస్తం దగ్గర చూసింది. ఆ నేస్తం రోజూ బొమ్మలో డబ్బులు వేయడం చూసి ముచ్చటపడింది. తనకూ ఓ కిడ్డీ బ్యాంక్ కావాలనుకుంది. తనుకూడా రోజూ కొంత పొదుపు చేయాలని నిశ్చయించుకుంది. ఆడుతూ పాడుతూ పిల్లలు పొదుపు చేయడానికి సరైన సాధనం ఆంధ్రా బ్యాంక్ వారి కిడ్డీ బ్యాంక్. అది గ్రహించిన చిన్నారి బాలలు లక్షలమంది ఉన్నారు. బేబీ గీత వారిలో ఒకతె.

దాదాపు 55 సంవత్సరాల అపారమైన అనుభవం గడించి, 640 కి పైగా శాఖలతో, దేశమంతటా విస్తరించిన ఆంధ్రా బ్యాంక్, అనేక యితర పథకాలను కూడా ప్రవేశపెట్టింది. అవే - కల్పతరువు, భాగ్యలక్ష్మి, సంరక్ష, సంక్షేమ, గృహకల్ప, జనసహాయ, కర్షక సహాయ, మరియు మహిళా సంక్షేమ పథకాలు. ప్రతి పథకం ప్రత్యేకమైనదే. ఒక్కొక్క సమస్యను తీర్చడానికి ఒక్కొక్క పథకం.

అంతేకాదు, కీలక రంగానికి, బలహీన వర్గాలకు కూడా ఆంధ్రా బ్యాంక్ ఆర్థిక సహాయం చేస్తోంది.

## ఆమె తండ్రి ఒక అద్భుతమైన బొమ్మను గీతకు కానుకగా ఇచ్చాడు. అదే ఆంధ్రా బ్యాంక్ వారి కిడ్డీ బ్యాంక్. అదే గీత అడిగిన బొమ్మ.



దీ ఆంధ్రా బ్యాంక్ లి.

కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్, హైదరాబాద్-500 001.

ప్రజావసరాలకై పాటు పడేదే - ఆంధ్రా బ్యాంక్. ఓ. స్వామినాథరెడ్డి : ఛైర్మన్

KIRON/AB/78

# పాపిన్స్ కాగితంతో తమాషా

ఇదుగో రామ్, శ్యామ్
మీకు నేర్పించే కొన్ని చిటకాలు—
కాగితంతో చేసేవి—
గమ్మత్తుకీ, సరదాకీ

**'విండ్ మిల్' చిత్రవిచిత్రం**
మీక్కావలసినవి : చతురస్రాకారంలో ఉండే కార్డ్ బోర్డు, కత్తెర, మేకు లేదా పిన్ను, సుత్తి, బటన్, వెదురు గడ, పెన్సిలు, స్కేలు.







చేసే విధానం అంచెలవారీగా
చతురస్రాకారపు కార్డ్ బోర్డు కాగితం పైన ఒక మూలనుండి మరొక మూలకు 2 ఐమూల రేఖలను గీయండి. ప్రతి చివరనుంచి కేంద్రం వేపుకు ఉండేలా కొయ్యండి. కోసిన ప్రతి భాగమూ చదరానికి ఒక వైపుకు సగం పొడుగు వుండేలా చూడండి.

ప్రతి చివరనీ మధ్యకి వచ్చేలాగ మడిచి చివరల్ని అన్నిటినీ పట్టుకుని, కాగితపు మధ్యలో మేకు లేదా పిన్నును నొక్కండి.

బటన్ వెనక త్రెడ్ వేసి, వెదురు గడకు మేకు కొట్టండి. విండ్ మిల్ తిరగటానికి బాగా జాగా వదిలి పెట్టండి. ఇంక సరదా మీదే !










పార్లే
# పాపిన్స్
పండ్లరుచిగల తీపి రమెంట్లు
నోరూరించే...మనసుదోచే...మైమరపించే

5 పండ్ల సువాసనలలో—
రాస్ప్‌బెరి, అనాస, నిమ్మ,
నారింజ, మోసంబి.

everest/78/PP/247-tl